సరస్వతీ గ్రంథమండలి
అనుబంధమాలిక

# బక్సారు యుద్ధము

( ఆంగ్లేయులు బంగాళాదేశము జయించిన కథ )


మొసలికంటి సంజీవరావు

"మొగలాయీ దర్బారు", "సంజీవి", "ఔరంగజేబుపాదుషా"
మొదలగు గ్రంథముల కర్త


రు 1/-


పబ్లిషర్సు: అద్దేపల్లి అండుకో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

ప్రథమ ముద్రణము : 1925
ద్వితీయ ముద్రణము : 1931
తృతీయ ముద్రణము : 1954

Saraswathi Power Press, Rajahmundry
Printed and Published by
A. Nageswara Rao
For Addepally & Co., Educational Publisher
Order No. 8670/1954

# పీఠిక

ఆంగ్లేయ సామ్రాజ్యము మనదేశమందు వ్యాప్తిగాంచిన విధమును గురించి గ్రంథకర్త వ్రాయనుద్దేశించిన గ్రంథములలో "బక్సారు" యుద్ధమను నీపుస్తకము రెండవది. ఇందు "ప్లాసీ" యుద్ధము మొదలు "బక్సారు" యుద్ధమువరకు జరిగిన విషయములన్నియు సమగ్రముగ వర్ణింపబడియున్నవి. ఈరెండుయుద్ధములకు మధ్యజరిగిన చరిత్ర చాల ముఖ్యమైనది. ప్లాసీయుద్ధమమూలమున ఆంగ్లేయులకు రాజ్యసంపద లభించెను: బక్సారుయుద్ధముమూలమున అది వారికి స్థిరపడెను ఇట్లు స్థిరపడుటకు పూర్వము మీర్జాఫరు మీర్కాసీం అను బంగాళా నవాబు లిద్దరు అధికారమునుండి ఇంగ్లీషువారిని తొలగించుట కనేక ప్రయత్నముల గావించిరి. మీర్జాఫరు చేసిన ప్రయత్నములన్నియు రహస్యములయినవి బుద్ధికుశలుడగు క్లయివు ఈ రహస్యకుట్రల నన్నిటిని తెలుసుకొని వాటివలన ప్రమాదము కలుగకుండ ఆంగ్లేయుల అధికారమును కాపాడెను. మీర్కాసీం సైన్యములను తయారుచేసి బహిరంగముగ ఇంగ్లీషువారిపై యుద్ధముచేసెను. ఈ యుద్ధములో ఆతనికి అయోధ్యానవాబు షాఅలం చక్రవర్తియు సహాయము చేసిరి. కాని, ఇంగ్లీషు సేనానులు శక్తిసామర్థ్యముల గలవారగుటచే నతనికి జయము రాకపోయెను. బక్సారు యుద్ధమందతడు సంపూర్ణమగు నపజయమును పొందుటచే బంగాళారాజ్య మాంగ్లేయులు వశము చేసుకొనగలిగిరి. అది మొదలు బంగాళమందు ఇంగ్లీషువారి నెదిరింప గలవా రెవ్వరు లేరైరి. అసమాన్యమగు ధనధాన్య సమృద్ధిగల నీరాష్ట్రము వారి స్వాధీనమైన కారణమున మనదేశములోని తక్కినభాగములను కూడ సులభముగ జయింపగలిగిరి.

ఈ పైవిషయముల నన్నిటిని గ్రంథకర్త విపులముగ వివరించియున్నారు. వారి అభిప్రాయముల నన్నిటిని సహేతుకముగ నిరూపించిరి. మీర్కాసీమునకు ఇంగ్లీషు వారికిని జరిగిన యుద్ధములలో నిరుపక్షములవా రెట్లు ప్రవర్తించిరో, ఏ సందర్భములు ఇంగ్లీషువారి కనుకూలించినవో, మీర్కాసీమునకు ప్రతికూలించిన సందర్భము లేవియో గ్రంథమందు స్పష్టపరుపబడియున్నవి. గ్రంథకర్తయొక్క శైలిసరళముగను పటుత్వము గలిగియునున్నది. ఈపుస్తకము సామాన్యజనులకేగాక విశ్వవిద్యాలయ పరీక్షలకు చదువు విద్యార్థులకుగూడ ఉపయోగించగలదు.

మహారాజాకాలేజి
విజయనగరం
౧౮ - ౩ - ౨౫

మామిడిపూడి వెంకటరంగయ్య

# Books Consulted :

| | |
|---|---|
| History of British India | Mill and Wilson |
| Decisive Battles of India | Malleson |
| History of Hindustan | Orme |
| India under the Early British Rule | R. C. Dutt |
| British Dominion in India | Sri A. Lyall |
| Empire in Asia | Torren M. P. |
| The Oxford History of India | V. A. Smith |
| Essay on Clive | Macaulay |
| Introduction to The Fifth Report of the Company | |
| History of India | P. E. Roberts |
| India, Past and Present and Some Others | Sri Valentine Chirol |

BATTLE OF BUXAR :

Approved by the Text Book Committee, 11-5-26.

# బక్సారు యుద్ధము

## మీర్జాఫరు

హైందవచారిత్రమునందు 'ప్లాసీయుద్ధము' మిక్కిలి ప్రధానమైనది. అయ్యది హైందవ స్వాతంత్ర్య మంతరించుటకుఁ గారణముగఁ బరిణమించెను. ఆదిమధ్యాంతరహితమగు భారత చారిత్రమున నొక నూతనయుగము ప్రారంభ మగుట కయ్యది కారణ భూతమాయెను. తొల్లి, స్థానేశ్వరయుద్ధము మహమ్మదీయ విజృంభణమున కెట్లు దారిజూపెనో, అట్లే ఆంగ్లేయ విజృంభణమున కీ ప్లాసీయుద్ధము మార్గదర్శి యాయెను.

కాని, అంతవఱకును కేవలము వర్తకులవలె సంచరించుచు లాభ మార్జించుచుండిన ఆంగ్లేయులు ప్లాసీయుద్ధమున విజయులై నంతమాత్రమున, బంగళా, బీహారు, ఒరిస్సా దేశములు వారియధీనము కాలేదు. ఆంగ్లేయు లెంతటి యాశాపరులైనను, ఎంతటి సాహసవంతులైనను, ఎంతటి యుపాయ ధురీణులైనను, తోడనే యా దేశములను స్వాధీనపఱచికొను నాసక్తిగాని సామర్థ్యముగాని వారి కా సమయమున లేదు.* ఆలివర్దీఖానువంటి రాజనీతి విశారదుఁడును రణవ్యాపారపారాయణుఁడును ఆ సమయమున రాజ్యాధిపతియై యుండెనేని,

---

* Cf.—"Although they were conquerors defacto, they neither could nor would assume the attitude of rulers dejure;..."...Lyall's British Dominion in India, P. 142.

ఆంగ్లేయులను నొక్కియుంచుటకును, దేశస్వాతంత్ర్యము నిలువబెట్టుటకును నవకాశ ముండియుండెను. కాని, దౌర్భాగ్యుఁడగు మీర్జాఫరు రాజ్యాధిపతి యగుటచే నట్టి యవకాశము తొలంగెను. ఆశాపరులును, బలవంతులును, ఉపాయధురీణులును అగు నాంగ్లేయుల సాహాయ్యముచే మూఢుఁడగు మీర్జాఫరు సింహాసనమున నధిష్ఠింపఁగోరెనేగాని, వారివలనఁ దన కెట్టి గతి సంభవింపనుండెనో గుర్తింపఁజాలఁ డాయెను. పాపపుణ్యాములు గణింపక స్వామిద్రోహమున కొడఁబడి, తానును తన సంతతివారును రాజ్యాధిపత్యమును శాశ్వతముగ ననుభవింపవలయుననిమాత్రమే యాతఁ డాసించెనుగాని, రాజ్యప్రదాతలగు తన యాంగ్లమిత్రులే తదున్నతాసనమునుండి తనను దిగఁద్రోసి క్రమముగాఁ దన రాజ్య మాక్రమింతురని యెఱుంగఁ డాయెను.

బంగళా, బీహారు, ఒరిస్సా దేశములు క్రమముగా నాంగ్లేయుల కెట్లు వశ మాయెనో గమనింపవలసియున్నది.

మీర్జాఫరు దుర్బలుఁడై యుండుటయేగాక, ప్రజాకంటకుఁడు కూడనై యుండెను. ఆ కారణముచేతను, తదితరకారణములచేతను, దేశము పెక్కు పరివర్తనములకును విప్లవములకును రంగస్థల మాయెను. ఆంగ్లసేవకులు జలగలవలె దేశమునందలి ధనము బీల్చివైచుచుండుటచే, ధనవంతమగు బంగాళా దేశము దారిద్ర్యమున కాలవాలమాయెను; రాజ్యాధికారము విచ్ఛిన్న మాయెను; దేశమున శాంతి యనునది శూన్య మాయెను. బాహ్యపరిస్థితులుకూడ ననుకూలించుటచే,

నుపాయశాలురును సాహసవంతులును కార్యసాధనమునం దసాధారణ నైపుణ్యము గలవారును నగు నాంగ్లేయు లా దేశములను స్వాధీనపఱచికొనఁగలిగిరి.

అనేక కారణములచే మీర్జాఫరు ప్రజాకంటకుఁడై యుండెను. ఆతఁ డొనరించిన స్వామిద్రోహమును బ్రత్యక్షముగఁ గాంచుచుండిన జను లాతని గౌరవింపఁజాలరైరి. తా నొనరించిన దోషమును గప్పివేయు ఘనకార్య మెం డొనరించియో, లేక మఱి యే తెఱంగుననో ప్రజాహృదయ మాకర్షించు నైపుణ్య మాతఁ డెఱుంగఁ డాయెను.

మీర్జాఫరును జను లేవగించుటకు మఱియొక కారణ ముండెను. రాజు దైవాంశసంభూతుఁ డనియు, దైవసమానుఁ డనియు జనులు నుతింతురు. అట్టి రాజ్యాధిపతి పరదేశాగతులగు నాంగ్లేయులపై నాధారపడియుండుటఁ గాంచు జను లెట్లు సహింపఁగలరు? ఒక్క సంవత్సరము క్రిందట, సురాజదౌలా చతురంగబల సమేతుఁడై కలకత్తానగరముపై దాడి వెడలి, మదోన్మత్తులై యుండిన ఆంగ్లేయుల పీఁచమడఁచి, జయ జయ ధ్వానములు ముందఱఁ బిఱుంద నేతేర మహావైభవముతో నిజ రాజధాని కరుదెంచుట నా దేశస్థులు కనులారఁ గాంచియుండిరి. కాని, స్వామిద్రోహియగు మీర్జాఫ[రు] రాజ్యాధిపతి యైనంతనే రంగము కడు విషాదకరముగ మాఱిపోయెను.

మీర్జాఫరునకు 'మీరాన్' యను నొక కుమారుఁడుండెను. తండ్రియొక్క లోపములను సవరించుకొని యప్రమత్తుఁడై

మెలంగుటకు మాఱుగ, నాతఁడు మిక్కిలి దురుసు స్వభావుఁడై కేవలము నిరంకుశముగఁ బ్రవర్తించుచుఁ గ్రౌర్యము లొనరించుచు, తండ్రికంటె నెక్కుడు ప్రజాకంటకుఁడు కాఁజొచ్చెను.

రాజ్యాధిపతియైనదాది, మీర్జాఫరు సౌఖ్యమెట్టిదో యెఱుంగఁడు. ధనాగారమునందలి ధనమంతయు నాంగ్లేయులను తృప్తిపఱచుటకే చాలదాయెను.♦ ప్లాసీయుద్ధమునఁ బాల్గొనిన ఆంగ్లసైనికులు తత్కారణమున లభించిన ధనముతోఁ దప్పద్రావి, మైమఱచి, దుర్వ్యసనము లధికము లగుటచేఁ బెక్కండ్రు మరణించుచుండ,* తనసైనికుల కొసఁగుట కొక్క కాసైనను మీర్జాఫరునకు లేదాయెను. ఐదాఱు మాసములనుండియు వారికి జీతబత్తెములు సరిగా ముట్టుటలేదు. తమ

♦ "నవాబు కోశాగారము నందుండిన ధనరాశినంతయు దిట్టమగు నేడువందల పెట్టెలలో భద్రపఱచి, ఆ పెట్టెలను భద్రముగ నూరునావల కెత్తించి, జనులెల్లరు వెలవెలబోయి చూచుచుండ, జయభేరులను మ్రోగించుచు, తమ జాతీయపతాకము లెగురవేయుచు, నాంగ్లసైనికులు మూర్షదాబాదునగరము వీడిరి........................ఇంత ధన మొక్కసారి తరలుటచే, మూర్షదాబాదునందలి బొక్కసము మాత్రము శూన్యమాయెను. ఆ కోశాగారమట్లు శూన్యమైనను నవాబు చెల్లింపవలసిన పైకమంతయుఁ జెల్లకుండుటచే, ఆ కొఱఁతకు బదులుగ, చిరకాలార్జితములగు నాభరణములు గూడ నాతఁడు సమర్పించికొనవలసిన వాఁడాయెను."

ప్లాసీ యుద్ధము, పు. 29—Cf. Orme Vol. 11 P. 187.

* Cf......his troops, with the prize-money distributed among them in consequence of the battle of Plassey, had indulged in such intemperance, that many of the Europeans had died......" Mill—Vol. III P. 270.

యేలిక రాజ్యాధిపతియైనంతనే తమ దారిద్ర్యము తీఱిపోవు నని వారాసించియుండ, నిలువయుండిన ధనము నాంగ్లేయులు గొంపోయిరి. ఆ కారణమున సైనికుల దురవస్థ మఱింత దుర్భరమాయెను. వారిని శాంతపఱచుట మీర్జాఫరునకుఁ బ్రధానకర్తవ్య మాయెను.

కాఁబట్టి, ధనసంగ్రహణము మీర్జాఫరున కావశ్యక మాయెను. కాని, ఆతఁడు రాజనీతిజ్ఞుఁడును, పరిపాలనాధురంధరుఁడును, ఆర్థిక శాస్త్రకోవిదుఁడును కాఁడాయెను. కరవాలము గైకొని శత్రుసైన్యముల నుఱుమాడుటకును, పరదేశాగతులగు నాంగ్లేయులతోఁ గుట్రలు సలిపి స్వామిద్రోహ మొనరించుటకును మాత్రమే యాతఁడు చాలియుండెను. అట్టి మీర్జాఫ రెట్టులైనను ధనము సంగ్రహింపవలయునని సమకట్టి మఱింత ప్రజాకంటకుఁ డాయెను, దేశమును మఱింత నికృష్ట దశకుఁ దెచ్చిన వాఁ డాయెను.

మీర్జాఫరునకు ద్రోహబుద్ధి సహజగుణమైనట్లు కాన్పించును. సురాజదౌలాను రాజ్యభ్రష్టు నొనరించు సందర్భమునసే గాక, ఇతర సమయములందుఁగూడ మీర్జాఫరునకు 'రోయిదులుబ్' అనేక తెఱంగుల సహకారియు, నుపకారియునై యుండెను. అట్టి మంత్రిపుంగవునితో సఖ్యముగ నుండి, అట్టి యనుభవజ్ఞుని సాహాయ్యము వడసి వలయు రాజ్యాంగ సంస్కరణముల నొనరించి, దేశమున శాంతి నెలకొల్పి, ఆర్థిక పరిస్థితులను జక్కఁబఱచికొనుటకు మాఱుగ, మీర్జాఫరు

మూఢుఁడై వాని ధనమెట్లులైన నపహరింపవలయునని యెంచి వాని నెట్లులైనను వంచింపవలయునని నిశ్చయించెను. మతద్వేషముకూడ నొక కారణమై యుండునని చరిత్రకారుఁడగు మిల్లు వ్రాసియున్నాఁడు. కాని, 'రోయిదులుబ్' ఆంగ్ల పక్షపాతి యని యెంచి మీర్జాఫ రాతనిపైఁ గుపితుఁడై యుండవచ్చునని యనుమానించుటకు విశేషావకాశ మున్నది. ఏమైనను, విశ్వాసఘాతుకుఁడగు మీర్జాఫరుయొక్కయు, దుర్మార్గుఁడగు మీరాన్ యొక్కయు కుట్రలు భరింపఁజాలక ఆంగ్లేయుల సాహాయ్యము వడసి రోయిదులుబు కలకత్తానగరమునకు నిర్గమింపఁ బ్రయత్నించెను. కాని, పాపమాతఁడు రయమ్మున హంతకులచేఁ దెగటాఱెను.

మీర్జాఫరుయొక్క దౌర్బల్యమును, అవివేక ప్రవర్తనమును గాంచుచుండిన రాష్ట్రాధిపతు లాతని యధికారమును ధిక్కరింప నారంభించిరి. ఎద్దియో విధమున వారిని లోఁబఱచుకొని దేశమున శాంతి నెలకొల్పుట ప్రధాన కర్తవ్యమాయెను. వారిపై దండెత్తి వారిని లోఁబఱచికొనవలయునని మీర్జాఫరు సంకల్పించెను. తన సైన్యముల నాతఁడు పూర్తిగ విశ్వసింపఁజాలని వాఁ డగుటచే నాతనికి నాంగ్లసైన్య సాహాయ్య మవసర మాయెను. ఆ కారణమున, తన సైన్యములతోఁబాటు ఆంగ్లసైన్యములను గూడ వెంటఁగొని, బీహారు రాష్ట్రాధిపతి యగు రామనారాయణునిపై దండెత్తుట కాతఁడు బయల్వెడలెను.

దుర్బలుఁడగు మీర్జాఫరు శ్లేష్మములోఁ బడిన యీఁగవలెఁ గొట్టుకొనుచుండ, సూక్ష్మబుద్ధియగు క్లైవు పరిస్థితులు జక్కఁగఁ బరిశీలించుచుండెను. తన సాహాయ్యము లేకుండ మీర్జాఫరు ముందంజ వేయఁజాలఁడని యాతఁడు గుర్తించెను. మీర్జాఫరును బీడించి మఱింత ధనము గ్రహించుట కదియే తరుణమని క్లైవు యోచించెను.* అట్లు యోచించి, తమకింకను ఇరువదిమూఁడులక్షల రూపాయలు చెల్లవలసి యుండెననియు, పైక మాఋణము చెల్లించినగాని తా నడుగు వేయువాఁడను గాననియును కఠినముగ నాతఁడు నబాబున కెఱింగించెను. ప్రసిద్ధ నక్షత్రకునిబోలిన క్లైవును మీర్జాఫరు వారింపఁ జాలఁడాయెను. బీహారు రాష్ట్రాధిపతిని దండింపఁగోరిన మీర్జాఫరు క్లైవును సంతృప్తిపఱచుట మిక్కిలి యవసరమై యుండెను. మూర్షదాబాదునందలి కోశాగారమున సగము పైకము మాత్రముండెను. కాని, క్లైవు సగము సగములతో సంతసించువాఁడు కాఁడు. కాఁబట్టి, ఆ సగము పైకమును వ్రాసియిచ్చి మిగిలినపైకముక్రిందఁ గొన్నిజిల్లాల శిస్తులనుగూడ శాస్త్రసమ్మతముగ వ్రాసి నబాబు సమర్పింప,† క్లైవు సంతుష్టాంతరంగుఁడాయెను.

---

* Cf. "Clive perceived his opportunity; and refused to proceed with him, unless all the sums due upon the agreements with the English were previously discharged". Mill—Vol. III, P. 272.

† "Orders were signed upon the treasury for one half: and tuncaws that is, orders to the local receivers to make payment out of the revenues as they come in, were granted on certain districts for the remainder." Mill—Vol. III P. 273.

కాఠిన్యము వహించి యెట్లైనను ధనము సంగ్రహింప వలయునని మాత్రమే క్లైవు యోచించెనుగాని, మీర్జాఫరున కుపకార మొనరింపవలయునని భావింపలేదు. కార్యము నెఱవేఱినపిమ్మట, ఎద్దియో నెపమున వెనుకకు మఱలవలయునని అయ్యాంగ్లనాయకుఁడు యోచించెను. బీహారు రాష్ట్రాధిపతి యగు రామనారాయణుఁడు మిక్కిలి బలవంతుఁడనియు, ఆతనికి నయోధ్యదేశాధిపతియును మహారాష్ట్రులును గూడఁ దోడ్పడుదురేని, ఆతని జయించుట కష్టతరమగుననియును నిరూపించి, రామనారాయణునితో సంధి గావింతునని యాంగ్ల మహావీరుఁ డెఱింగించెను. సర్వజ్ఞుఁడగు క్లైవు శాసించునపుడు, అల్పజ్ఞుఁడగు మీర్జాఫ రేమిచేయఁగలఁడు? ఫ్రెంచిసైనికుల యొక్కయు మహారాష్ట్రులయొక్కయు సాహాయ్యము వడసి అయోధ్యదేశాధిపతి యరుదేరనుండెననికూడ నాసమయముననే తెలియవచ్చెను. అంతియేగాక, మహారాష్ట్రనాయకుఁ డొకఁడు నిజముగ నరుదెంచి, తమకుఁ జెల్లవలసియుండిన యిరువదినాలుగులక్షల రూపాయల చౌతును జెల్లింపవలయునని కోరెను. పరిస్థితు లటులుండుటచే, క్లైవు చెప్పినచొప్పున ప్రవర్తించుట తప్ప మీర్జాఫరునకు మార్గాంతరము కానరాకుండెను. కాఁబట్టి, ఆతనికిని రామనారాయణునకును ఎద్దియో సంధి కుదిరెను.

కాని, వా రిరువురకు సంధి కుదురునంతమాత్రమున క్లైవునకుఁ గలుగు లాభమేమి? అయ్యాంగ్లవర్తకశిఖామణి యెద్ది

మైన లాభము గ్రహించినగాని సంతసించువాఁడు కాఁడు. మీర్జాఫరును బీడించి, మాఱుమాటాడుటకైన నాతని కవకాశ మొసంగక యిరువదిమూఁడులక్షల రూపాయలను సంగ్రహించి నను, క్లైవు సంతసింపఁడాయెను. నబాబ ట్లసహాయుఁడై యుండినప్పుడే, ఆతనివలన మహత్తరలాభ మొకటి గ్రహింప వలయునని క్లైవు నిశ్చయించెను*. ఆ ప్రాంతమున సురేకార వ్యాపారము మిక్కిలి లాభకరముగ నుండెను. ఆవ్యాపారము వలని లాభము క్రమముగా వేయి మడుఁగు లధికమగునని క్లైవు గుర్తించెను. తోడనే, ఆతని దృష్టి యా వ్యాపారముపై బాఱెను. కాఁబట్టి, సురేకారవ్యాపారము శాశ్వతముగను పూర్తి గను, కంపెనీ యధీనము చేయవలయునని యాతఁడు కోరెను. అందుకుఁ బ్రతిఫలముగ నబాబున కాతఁడు మిక్కిలి లాభకర మగు షరతులను బ్రదర్శించెను. కాని, క్లైవుయొక్క యాడం బరము గాంచి మీర్జాఫరు భ్రమించుకాలము మీఱియుండెను. ఆంగ్లేయకంపెనీ సేవకులు విశ్వసనీయులు కారని యతఁడు క్రమముగా నరయుచుండెను. ఆ కారణమున నతఁ డా వ్యాపారము వారి యధీనము చేయరాదని యోచించెను. † కాని, ఆతఁ డెంత ప్రయత్నించినను కార్యము లేకపోయెను.

* Cf :— " He even extorted from him another grant, of no small importance to the English treasury" —Mill—Vol. III, p. 274.

† ...... " but the Nabob knew that he could not demand from the English the regular present which he could derive from a renter placed at his mercy ; he was not therefore inclined to the arrangement ; but after a variety of objections the necessity of his circumstances, compelled him to comply " —Mill—Vol. III, p. 274.

కార్యముపట్ల క్లైవు మోమోటము పడువాఁడుకాఁడు. ఆతఁడు కాఠిన్యము వహించి యుండుటచే, దుర్బలుఁడగు మీర్జాఫ రియ్యకొనవలసినవాఁ డాయెను.

ఆ తెలంగున నబాబును బీడించి, 1758 మే 15 వ తారీ ఖున క్లైవు మూర్షదాబాదు నగరమునకుఁ బోయెను. నబాబు రాజధాని కేతెంచువఱకున్నైన నిలచియుండక, 24 వ తారీఖున నతఁడు కలకత్తానగరమునకుఁ బ్రయాణమాయెను.

ఆ సమయమునఁ గర్ణాటక దేశమున నాంగ్లేయులస్థితి కడు ప్రమాదకరముగ నుండెను. ఆంగ్లేయులవలెనే యాశాపర వశులై యుండిన ఫ్రెంచివారు తమ శత్రువులగు నాంగ్లేయులను నిర్మూల మొనరించి రాజ్యాధికారములను జిక్కించుకొన వలయునని సమకట్టిరి. ఆ కారణమున నాంగ్లేయుల స్థితి కడు ప్రమాదకరముగ నుండుటచే, సైన్యములను వెంటబెట్టు కొని వెంటనే రావలయునని క్లైవునకు వారు వర్తమాన మంపిరి. ఆతఁడు నిజముగాఁ జెన్నపురి యాంగ్లప్రభుత్వసేవ కుఁడై యుండెను. బంగాళా దేశమునందలి సురాజదౌలా ఢాకకుఁ దాళఁజాలక పలాయన మొనరించినచో తోడి యాంగ్ల సేవకుల సహాయార్థము క్లైవు వాట్సనులు నియోగింప బడిన విషయమును పాఠకు లెఱింగియేయుందురు. బంగాళా దేశమున కరుదెంచిన క్లైవు ఎట్టి సాహసకార్యములచేతను, ఎట్టి వక్రమార్గములచేతను సురాజదౌలాను రాజ్యభ్రష్టు నొనరించియుండెనో, మద్విరచిత ప్లాసీయుద్ధమున వివరింపఁ

బడియున్నది. కార్యము నెఱవేఱినవెంటనే ఆ యాంగ్లనాయకుఁడు తొంటిప్రదేశమునకు రావలయునని తత్ప్రభుత్వాధికారు లాజ్ఞాపించియుండిరి. అంతియేకాక, ఆ సమయమున క్లైవు సాహాయ్యము వారికి మిక్కిలి యవసరముగ నుండెను. ఆ కారణముచే నాతని రాకకై వా రత్యుత్సాహముతో నిరీక్షించుచుండిరి. కాని క్లైవెట్లు ప్రవర్తించెనో గమనింపఁదగియున్నది. ప్లాసీయుద్ధకారణమున సురాజదౌలా విగతజీవుఁడైనంతనే, క్లైవు మహాపురుషుఁ డాయెను. అతి విశాలములును అతి సారవంతములును అగు బంగాళా బీహారు ఒరిస్సాదేశములను బరిపాలించు నబా బాతనిచేఁ బ్రతిష్ఠింపఁబడి, ఆతనికి దాసానుదాసుఁడై యుండెను. అభినవకల్పవృక్షమువలె, అభినవకామధేనువువలె నుండిన బంగాళాదేశ మాతని యధీనమై యుండెను. బంగాళాదేశ మనెడు కుబేరుని కోశాగారతాళ మాతని హస్తముననుండెను. ఆతఁ డట్లు మహావైభవాక్రాంతుఁడై యుండ, బంగాళాదేశ మెట్లు వీడఁగలఁడు? కాఁబట్టి, చెన్నపురి ప్రభుత్వవర్గము భంగపడినను సరె, వైరులగు ఫ్రెంచివా రాప్రాంతమున రాజ్యాధికారవైభవ సమన్వితులైనను సరె, తానుమాత్రము బంగాళాదేశముననే యుండవలయునని క్లైవు నిశ్చయించెను.*

---

* "Clive chose to remain in Bengal, where he was the master, rather than go to Madras, where he would be under command........"—Mill, Vol. III. P. 279.

ఆ సమయమున నుత్తరసర్కారులు ఫ్రెంచివారి యధీనమున నుండెను. ఉత్తరసర్కారులందలి రాజ్యాధిపతులలో నెల్ల విజయనగరరాజ్యాధిపతియగు ఆనందరాజు ప్రధాన పురుషుఁడై యుండెను. ఆసమయమున, సుప్రసిద్ధ ఫ్రెంచి నాయకుఁడు బుస్సీదొర హైదరాబాదుదేశమునందలి రాజకీయవ్యవహారములందు నిమగ్నుఁడై యుండెను. అట్టి సమయమునందే, ఆంగ్లేయులను రావించి, ఫ్రెంచిసైన్యములను బాఱఁద్రోలి తన రాజ్యము పెంపుజేయవలయునని ఆనందరాజు యోచించెను. కాని, ఆంగ్లేయులు క్రమముగా దేశమునంతయు నాక్రమింతురనియు, తన రాజ్యమునకుఁగల స్వాతంత్ర్యము హరించి తనను సాధారణపు జమీందారునిగా నొనరింతురనియు నా వెడఁగు ఱేఁడు కలనైనఁ దలంచి యుండలేదు. ఆంగ్లసైన్యముల కగు ఖర్చులు రాజుగారు భరించుటకును, రేవుస్థలములను, నదీముఖముల నుండు గ్రామములను ఆంగ్లేయులు గ్రహించుటకును, వా రుభయులుం గలసి జయించు రాజ్యము రాజుగారికిఁ జెందవలయుననియు వా రొక సంధి గావించుకొనిరి.

ఆనందరాజుయొక్క యాహ్వానము చేరినంతనే క్లైవానంద పరవశుఁడాయెను. తోడనే, సైన్యసమేతుఁడై ప్రయాణమొనరించి ఆనందరాజును గలసికొని, ఉత్తరసర్కారులను స్వాధీనపఱచికొనవలయునని కృతనిశ్చయుఁడై తన నిశ్చితాభిప్రాయము నాతఁడు తన యనుచరుల కెఱింగించెను. కాని,

బంగాళా దేశమునందలి పరిస్థితు లింకను గంద్రగోళముగనుండెను. కంపెనీ సైన్యములు దేశాంతరము వెడలు టవివేక మని యెంచి కంపెనీ సంఘ సభ్యు లెల్లరు నేకగ్రీవముగాఁ దమ యసమ్మతిని ఖచ్చితముగా నెఱింగించిరి.* బంగాళా దేశము యొక్క బాహ్యాంతరపరిస్థితులను జక్కగ గమనించు వారెల్లరు నట్టులే భావింతురు. కాని, క్లైవు మాత్రము చలింపలేదు. తాను మాత్రమట నిలిచి, 500 సోల్జరులను, 2,100 సిపాయి లను, 14 పిరంగులను సమకూర్చి కర్నలు ఫోర్డు అనువానిని సైన్యాధిపతిగ నియోగించి, వారిని బంపివైచెను.

ఆ సమయమున నబాబునకును ఆంగ్లేయులకును గూడ గొప్ప యుపద్రవము సంభవించెను. రెండు మూడు సంవత్స రముల నుండియు బంగాళా దేశమున జరుగుచుండిన గంద్ర గోళములను జుట్టునుగల రాజ్యాధిపతులు వీక్షించుచుండిరి. అట్టి వారలలో నలహాబాదు సుబేదారుఁడగు మహమ్మదు కూలీఖానుఁ డొకఁడు. ఆ సమీపముననుండిన రాజా సుందర సింగును రాజా బలవంతసింగును ఆతనికి సాహాయ్యమొసంగు టకు సంసిద్ధులై యుండిరి. బలవంతుఁ డగు నయోధ్యాధీ శుఁడు కూడ బంగాళా దేశముపై దండెత్తఁగోరి యుండెను. ఆ సమయముననే, ఢిల్లీశ్వరుని కుమారుఁడు కారణాంతరము లచే నిజరాజధాని వీడి రోహిల్లా దేశమునకుఁ బాఱవలసిన

* Cf. "The project met with unanimous condemnation. But Clive disregarding all opposition, prepared his armament." —Mill, Vol. III P. 280.

వాఁడాయెను. యుద్ధసన్నద్ధులై యుండిన రాజ్యాధిపతులెల్లరు లెస్సగ విచారించి, తమ రణోద్యమమునకు సార్వభౌమ కుమారుని నాయకునిగా నేర్పఱచిరి. సార్వభౌముని పక్షమున దాము దండెత్తు నటులు ప్రవర్తించినచోఁ దమ పలుకుబడి హెచ్చుగ నుండునని గ్రహించియే వారట్లొనరించిరి. ఢిల్లీశ్వరుని యధికారము నానాఁటికి సన్నగిలుచుండినను, ఆతఁ డింకను సార్వభౌముఁడై యుండి, ప్రజాహృదయము నాకర్షించుచుండెను. బంగాళాధిపతి యాతనికింకను గప్పము చెల్లింపవలసినవాఁడై యుండెను. సార్వభౌముఁడు దుర్బలుఁడైనను, ఒక నబాబును దీసివేయుటకును, ఇంకొకని నియోగించుటకును దక్షుఁడై యుండెను. తనకుఁగల యధికారము ననుసరించి, బంగాళా బీహారు దేశములకుఁ దన కుమారు నాతఁడు సుబేదారుగా నియమించెను. మీర్జాఫరుపై దండెత్తి సార్వభౌమ కుమారునిఁ దద్రాజ్యాధిపతి నొనరింపవలయుననియు, తాము పెక్కులాభములను బడయ వలయుననియు నాసించి, సమరకార్యైక తత్పరులై, వారు దాడి వెడలిరి.

తనకు రానుండిన మహోపద్రవము నెఱింగినంతనే మీర్జాఫరు భయకంపితుఁడాయెను. ధనహీనునికంటె బలహీనుఁడు వేఱొకఁ డుండఁడు. ఆంగ్లేయుల కారణమున దారిద్ర్యనిమగ్నుఁడైనమీర్జాఫరు జీవితము నిరర్థకమైయుండెను. తనకుమారుని దుష్ప్రవర్తనములచే నాతఁడు ప్రజాభిమానమునకు మఱింత దూర మగుచుండెను. కాన, ప్రజల విరోధియూధములు

దండెత్తెనని తెలిసినంతనే, మీర్జాఫరు భయభ్రాంతుఁడై మఱల నాంగ్లేయులమీఁదనే యాధారపడవలసినవాఁ డాయెను.

కాని, ఆంగ్లేయుల స్థితి మాత్రము నబాబు స్థితికంటె క్షేమకరముగ నుండెనా? తన తోడి యధికారు లెల్లరు బంగాళాదేశమునందలి యాంగ్లసైన్యముల నుత్తరసర్కారులకుఁ బంపుట క్షేమకరము కాదని యెంత చెప్పినను, దుడుకు స్వభావుఁడై దురాశాపరవశుఁడై యుండిన క్లైవు సరకు సేయమి, ఆంగ్లేయుల స్థితి నిజముగా మిక్కిలి ప్రమాదకరముగ నుండెను. కాని, ఆతని నిరంకుశప్రవర్తనమే, ఆతని దుడుకుస్వభావమే, ఆతని మొండిసాహసమే, ఆతని నొక మహాపురుషు నొనరింపఁజాలిన వాయెను. అదృష్టదేవత యంధురాలను నార్యోక్తి సుప్రసిద్ధముకదా.

సార్వభౌమపుత్రుని యాజమాన్యముక్రింద బంగాళాదేశముపై దండెత్తగోరిన నృపాలు రెల్లరు తత్కార్యైకతత్పరులై రణ మాచరించి యుండిరేని, ఆంగ్లేయులపై నాధారపడియుండిన మీర్జాఫరు పరాజితుఁడై రాజ్యభ్రష్టుఁడై యుండెడివాఁడు. తోడనే, ఆంగ్లేయుల యాధిపత్య మంతరించి యుండెడిది; భావి హిందూదేశచారిత్రము పూర్తిగ మాఱియుండెడిది. *

---

* Cf. "A blow like this, at so critical a period, would have shaken to such a degree tottering Government of Jaffier, that the incipient power of the English might have despaired of restoring it......" Mill. Vol. III. P. 286.

కాని, అయోధ్యదేశాధిపతి, మందబుద్ధియై, మిత్ర ద్రోహము దలపెట్టి కడు హేయముగఁ బ్రవర్తించుటచే, నాంగ్లేయులకు రానుండిన యుపద్రవము తొలంగెను.

సార్వభౌముని కుమారుఁడు ముఖ్యముగా నలహాబాదు రాష్ట్రాధిపతి యగు మహమ్మదు కూలీఖానుపై నాధారపడి యుండెను. బీహారురాష్ట్రరాజధానియగు పాట్నానగరమును ముందుగా వశపఱచికొనవలయునని యెంచి వారిరువురు నా నగరమును ముట్టడించిరి. బీహారు రాష్ట్రాధిపతియగు రామ నారాయణునకును మీర్జాఫరునకును మైత్రి లేదని పారకు లెఱింగియున్నారు. కాఁబట్టి, రాజకుమారుని ప్రయత్నము లకు రామనారాయణుఁడు దోహదమొసంగుట సహజము. రాజకుమారుని సైన్యములకు దాఱి యొసఁగి, సైన్యసమే తుఁడై యాతఁడుకూడఁ దోడ్పడి యుండెనేని, బంగళా దేశము సులభముగా వారి యధీనమై యుండెడిది. అట్లుగాక, రాజకుమారుని వారించుటయే ఆచరణీయమని రామనారాయణుఁడు యోచించుటచే, మహమ్మదు కూలీఖాను పాట్నానగరమును ముట్టడింపవలసినవాఁ డాయెను. ముట్టడి జయప్రదముగా జరుగుచుండెను. పాట్నానగరదుర్గము కూలీ ఖానుని ఫిరంగులకు దారియొసంగెను. బీహారురాష్ట్ర రాజ ధాని యగు పాట్నానగర మతిశీఘ్రముగ నాతని యధీనము కానుండెను. అట్టి మహాసమయమున నాతని కొక గొప్ప విపత్తు సంభవించెను. తోడనే, సులువుగా వశము కానుండిన

నగరరాజమును వశపఱచుకొనకయే, దురదృష్టవంతుఁడగు ఖాను పరుగుపరుగున వెనుకకు మఱలవలసినవాఁ డాయెను.

అయోధ్యదేశాధిపతి సైన్యములను సమకూర్చుకొని తనకు సాహాయ్య మొనరించునని కూలీఖాను నిరీక్షించుచుండ, నాతఁడు పాట్నానగరమును ముట్టడించునపుడే, యాతని రాజధానియగు నలహాబాదు నగరము వశపఱచుకొనవలయు నని యాసించి, అయోధ్యదేశాధిపతి యా నగరముపై దాడి వెడలెను. ఆతఁ డట్లు హేయముగ మిత్రద్రోహముఁ దలపెట్టుటచేతనే, పాట్నానగరమును జయింపవలసిన కూలీ ఖాను నిజరాజ్య సంరక్షణార్థము రయమున నిర్గమింపవల సినవాఁడాయెను.

ఆంగ్లేయులకును మీర్జాఫరునకును రానుండిన మహోప ద్రవ మీ తెఱంగున నప్రయత్నముగాఁ దొలంగెను. క్లైవు సాహాయ్యమువలననే తనకు రాజ్యముదక్కియుండెనని మీర్జా ఫరు భ్రమించి, అయ్యాంగ్లవీరునకు 'ఉమ్రావ్' యను బిరు దము నొసంగెను. కాని క్లైవు వట్టి బిరుదములతో సంతసించు వాఁడు కాఁడు. కాఁబట్టి, ఆతని యభిప్రాయమెఱిఁగి, ఆతని యభిప్రాయ మొక యాజ్ఞగా శిరసావహించి, 27 లక్షల రూపా యలు సంవత్సరాదాయముగల జాగీరు నాతనికి మీర్జాఫ రొసంగెను. క్లైవు సంతుష్టాంతరంగుఁ డాయెను.

కాని, యాంగ్ల పాశబద్ధుఁడైన మీర్జాఫరు దురవస్థ నానాఁటికి దుర్భరమగుచుండెను. ఎట్టులైనను వారి పాశముల

2

నుండి తప్పించుకొని స్వేచ్ఛందముగ నుండవలయునని యతఁడు పరితపింప సాగెను. కాని, ఆతఁడు సామర్థ్యముగల తంత్రజ్ఞుఁడు కాకుండుటచేతను, అడుగడుగునకు నాంగ్లేయుల సాహాయ్యమే యవసర మగుచుండుటచేతను, ఱెక్కలువిఱిగిన పక్షి వలె విలపింపసాగెను. ఎవ్వరైనను వచ్చి తన్నుద్ధరింతురేమో యని యాతఁడు నిరీక్షించుచుండెను. ఆంగ్లమహాసముద్ర మధ్యమునఁబడి, స్వేచ్ఛందజీవనమునకై గిజగిజలాడుచుండిన మీర్జాఫరున కాసమయమున డచ్చివారు గోచరించిరి.

హాలండు దేశస్థులగు డచ్చివారికి బంగళాదేశమునందలి 'చిన్సూరా' యను గ్రామమున నొక కర్మాగార ముండెను. వారి వ్యాపార మాదేశమున మిక్కిలి తక్కువగా నుండెను. బంగాళాదేశాధిపతి యాంగ్లేయులపై నాధారపడియుండుటచే వారి వర్తకము గూడ మిక్కిలి వృద్ధిజెందెను. వారి యదృష్టము గాంచినంతనే డచ్చివా రసూయాపరులైరి. సముచితప్రయత్నము లొనరించి తాముగూడ ధనార్జన మొనరింపవలయునని వారు సమకట్టిరి. ఆ దేశమునందలి వర్తకమంతయుఁ బూర్తిగ నాంగ్లేయుల వశము కాకుండు తెఱంగున వర్తక సౌకర్యముల నేర్పఱచికొనుటయే వారి ప్రధానోద్దేశ మైనట్లు స్పష్ట మగుచున్నది.* ఆంగ్ల పీడనము భరింపఁజాలని మీర్జాఫరుకూడ వారికిఁ దగు ప్రోత్సాహ మొసంగినట్లు చరిత్రకారులవలనఁ దెలియవచ్చుచున్నది. అంత

* Vide—Mill. Vol. III. P. 290.

కంటె స్వాతంత్ర్యమునకై తత్తరపడుచుండిన మీర్జాపరును, ఆంగ్లేయులపై నసూయాపరులై యుండిన డచ్చివారును సహజముగ నొకరి సాహాయ్యము నొక రపేక్షించియుందురు. ఏది యెట్లున్నను, 200 డచ్చిసోల్జరులును 800 సిఫాయిలును 1759 ఆగష్టు మాసమున హుగ్లీనది బ్రవేశించిరి. ఆంగ్లేయుల కయ్యది గొప్ప విపత్సమయమై యుండెను. క్లైవు సంఘాభిప్రాయ విరుద్ధముగ నాంగ్లసైన్యముల నుత్తరసర్కారులకుం బంపి యుండిన కారణమున, బంగాళాదేశము తలుపులు తెఱచిన కోటవలె నుండెను.

ఆసమయమున నాంగ్లేయులకును డచ్చివారికిని వైరము లేదు. కాఁబట్టి, డచ్చిసైన్యము హుగ్లీనది బ్రవేశించి వారికిఁ జెందియుండిన 'చిన్సూరా' ను జేరబోవుట యొక నేరము కాదు. అట్టి సందర్భమున వారిపై నాంగ్లేయులు దండెత్తుట ధర్మవిరుద్ధము. కాని, బంగాళాదేశమును దన కాణాచివలెఁ జూచుచుండిన క్లైవు డచ్చివారి యాగమనము సహింపఁజాలడాయెను. అతఁడు కడు నదృష్టవంతుఁడు కర్నలు ఫోర్డు ఉత్తరసర్కారులనుండి ఫ్రెంచివారిని బాఱద్రోలి సమయమున కరుదెంచెను. కాబట్టి, ధర్మాధర్మవిమర్శన మటుంచి నోరెత్తుటకైనను మీర్జాఫరున కవకాశ మొసంగక, క్లైవు యుద్ధసన్నద్ధుఁడై, డచ్చివారిపైఁ బడెను. వారిసైన్యము తుత్తునియ లాయెను. క్లైవు విజయుఁడాయెను. తగుకారణము లేకుండ డచ్చివారిపై నాంగ్లేయులు దండెత్తు టధర్మమైనను

బలవంతులగు నాంగ్లేయులతో ధర్మాధర్మముల గుఱించి చర్చించినచో, తమరు బంగాళా దేశమున నిలుచుటకే యవకాశ ముండదని వెఱచి, తామే నేరస్థులమని డచ్చివారంగీకరించి, యుద్ధపుఖర్చులుగూడ నాంగ్లేయులకుఁ జెల్లించిరి. తోడనే, తా నొనరించిన యపరాధము నెఱింగియుండిన క్లైవు డచ్చి వారి నావలను, ధనమును సామగ్రినిగూడ వారి కొసంగెను.

ఇయ్యది ఆంగ్లేయులకు మిక్కిలి లాభకరముగ నుండెను. వైరులగు ఫ్రెంచివారు దురదృష్టవశమున నింతకుఁబూర్వమే స్థానభ్రష్టులై యుండిరి. ఇపుడు, డచ్చివారి తెఱంగున భంగ పడిరి. కావున, ఆంగ్లేయులు మఱింత నిరంకుశముగఁ బ్రవ ర్తించుట కవకాశ మాయెను.

ఈస్టుఇండియాకంపెనీని ఉచ్చస్థితికిఁ దెచ్చి, మితిలేని ధన రాసు లార్జించి, తన కారణమున బంగాళా దేశమునకుఁ గలుగు నరాజకమును దారిద్ర్యమును దలంపక, 1760 ఫిబ్రవరి మాసమున క్లైవింగ్లాండు దేశమునకుఁ బోయెను. ఆతఁ డొనరించిన ఘనకార్యములకుఁ బరమానందభరితులై, ఆతఁ డొనరించిన దోషములను దలంపక, ఇంగ్లాండునందలి కంపెనీ డైరక్టర్లు నవరత్నఖచితమగు ఖడ్గము నాతని కొసఁగి బహూకరించిరి. నాఁటి యాంగ్లనృపాలుఁడగు మూడవ జార్జి క్లైవును ప్రభువు నొనరించెను. ప్రతిభాశాలియగు నాఁటి ప్రధానమంత్రి — పిట్టు — పలు తెఱంగుల నమ్మహావీరు నభినందిం

చెను. అన్యాయార్జితవిత్తమును విరివిగ వెచ్చించుచు న య్యాంగ్ల నాయకుఁడు మహావైభవముతోఁగాలము గడుపఁ దొడంగెను.

క్లైవు బంగాళా దేశమున నుండినపుడే, మీర్జాఫరుస్థితి కడు హేయముగను కడు విషమముగను నుండెనని పాఠకు లెఱింగియే యున్నారు. క్లైవు నిష్క్రమించిన పిమ్మట నబాబు స్థితి యెట్లు మాఱెనో గమనింపవలసి యున్నది.

బంగాళా దేశము ధనహీనమై కళావిహీన మగుచుండినను, ఆంగ్లేయుల ధనాశ మాత్రము దీఱదాయెను. నబాబు ద్రవ్యము దినుకొలఁది దారి ద్రవ్యావసరమధికమగుచుండెను. ఎక్కడి ధనమైనను, ఎంతటి ధనమైనను, అచటి కంపెనీ సేవకుల కైంకర్యమునకే చాలకుండెను.

క్లైవు వెడలునపుడు, 'వాన్సిటార్టు' యను నాతనిఁ దన స్థానమున గవర్నరుగ నియమించెను. చీకటికొట్టుననుంపఁబడి సజీవుఁడై వెలికివచ్చిన 'హాల్ వెల్' యును తదితరులును కంపెనీ సంఘసభ్యులై యుండిరి. క్లైవుచే నియోగింపఁబడిన వాన్సిటార్టు వక్రమార్గాన్వేషణమునఁ గొంతమట్టుకు గురువును బోలియుండినను, ఆతనికిగల యద్భుత మేధాశక్తియును చాకచక్యములును వాన్సిటార్టుయందుఁ గానరావు. తొల్లి సురాజదౌలాను రాజ్యభ్రష్టునొనరించి మీర్జాఫరును సింహాసనాసీను నొనరించునపుడు ఆంగ్లకంపెనీ సంఘ-సభ్యులగు క్లైవు ప్రభృతు లమితధనార్జన మొనరించిన విషయము 'వాన్సి

టార్టు' మొదలగు వారి మనసున నెల్లపుడు గోచరించు చుండెను. వారుకూడ నట్టులే, హిందుదేశమున నుండినపుడే, ధనార్జన మొనరింప వలయునని యోచించిరి.* అట్లు యోచించి, దుర్బలుఁడగు మీర్జాఫరును రాజ్యభ్రష్టు నొనరించి, ఆతని యల్లుఁడగు 'మీర్ కాశిము'ను సింహాసనముపై నిడి, తా మొనరించిన ఘనకార్యమునకై యాతనివలన ధనరాసు లను జేపట్టవలయునని వారు నిశ్చయించిరి. తా మొక్కరే లాభ మంతయుఁ గబళించినచోఁ దమ దేశస్థులు సహింపఁజాల రని యెంచి, కంపెనీకిగూడ లాభమును జేర్పవలయునని వారు యోచించిరి. భావిరాజ్యాధిపతి యగు మీర్ కాశిముతో నాంగ్లకంపెనీ సేవకు లొక సంధిగావించిరి. అతి సారవంతము లగు బర్ద్వాను, మిడ్నాపూరు, చిట్టాకాంగు జిల్లాలను నబాబు ఆంగ్లకంపెనీకి శాశ్వతము నొసంగవలయును. ఇంకను మీరా ఫరు చెల్లింపవలసియుండిన పైకముగూడ నాతఁడు చెల్లింప వలయును. కర్నాటక దేశమున నాంగ్లేయులు కావించుచుండిన యుద్ధమున కాతఁ డైదులక్షలు రూపాయల విరాళము చెల్లింప వలయును.

---

* "The Vast sums, obtained by a few individuals, who had the principal management of the former revolution, when Meer Jaffir trode down Suraj-ad-dowla his master, were held in vivid remembrance; and the persuation that similar advantages, of which every man burned for a share, were now meditated by the Select Committee excited the keenest emotions of jealousy and envy."

Mill Vol. III. P. 309.

మఱియు, తనకు మహారాజ్య మీయఁగల యాంగ్లకంపెనీ సంఘసభ్యులకుఁ బదునెనిమిది లక్షలరూపాయలు బహుమాన పురస్సరముగా సమర్పించుటకుఁగూడ నాతఁ డియ్యకొనెను.

కుట్ర పూర్తియాయెను. కాని, మీర్జాఫరును రాజ్య భ్రష్టు నొనరించుట కొక కారణము నిరూపించు టవసరము. కావున నాతనిపై నెన్నియో నేరములు మోపఁబడెను. ప్రసిద్ధ పూరుషు లెందఱో యాతనిచే వధింపఁబడిరని నబాబుపై నొక నేర మారోపించిరి. కాని, ఆతఁడు నిజముగ నిర్దోషి యనియు, ఆతనికి నపకీర్తి తెచ్చు తలంపుననే నాఁటి ఆంగ్ల కంపెనీ సేవకు లట్టి నీచకార్యమునకుఁ గడంగిరనియును, ఆఱేండ్లు గడచిన పిమ్మట బంగాళాదేశమునందలి కంపెనీ సంఘ సభ్యులే వ్యక్తపఱచిరి.* మీర్జాఫరును రాజ్యభ్రష్టు నొనరించుటకు నిరూపింపఁబడిన రెండవకారణ మెద్దియన, రాజ్యపరి పాలనము నెఱుంగని మీర్జాఫరును ద్రోసివైచినగాని దేశమున శాంతి నెలకొనదనియు, శాంతి, నెలకొనినగాని కంపెనీ కింకను నబాబువలన ముట్టవలసియుండిన ధనము ముట్టఁజాల దనియును కంపెనీసేవకులు నిరూపించిరి. కాఁబట్టి స్వార్థపరు లగు నాంగ్లసంఘసభ్యులు మీర్జాఫరును రాజ్యభ్రష్టు నొన

---

* Addressing the Directors on 30th September 1766, they say, "In justice to the memory of the late Nawab Mir Jaffir, we think it incumbent on us to acquaint you, that the horrible massacres where with he is charged by Mr. Holwell in his address to the proprietors of East India Stock, are cruel aspertions on the character of the Prince which have not the least foundation in truth." —quoted by Torren, M. P.— 'Empire in Asia, —P. 44.

రించు టావశ్యకమని స్థిరపఱచిరి. ఈ సందర్భమున నొక విష యము గమనింపవలయును. 'ఎలిసు' మొదలగు కంపెనీసంఘ సభ్యులు కొందఱు మీర్జాఫరును దొలగింపరాదని వాదించిరి. మీర్కాశిము వారిని సంభావించియుండఁడు. ఏమైనను, వారి వైముఖ్యము ధర్మబద్ధమనుట విస్పష్టము. గవర్నరు మొదలగు వారి సంకల్ప మధర్మము, అనవసరము.*

కాని, కంపెనీసేవకుల మనస్సాక్షి కొంచెము పీకుచుండెను.† కావున వారొక మాయోపాయ మాలోచించిరి. కంపెనీ గవర్నరగు వాన్సిటార్టు సైన్యసమేతుఁడై బయలుదేఱి (2, అక్టోబరు, 1760), నబాబు రాజధానియగు మూర్షదాబాదు నగరము జొచ్చి, యాతని దుర్గమునఁ జొరబడి, మీర్జాఫరు పేరునకు మాత్రము నబాబుగనుండి నిజరాజ్యాధికారమంతయుఁ దన యల్లుఁడగు మీర్కాశిమున కప్పగింపవలయునని నిర్బంధించెను. మీర్జాఫరు రాజ్యాధికారవైభవ విరహితుఁడై జీవచ్ఛవంబువలె నట మననొల్లక, ఆంగ్ల సేవకులను దిట్టుచు, వారివెంటనే వారి రాజధానికిఁ బోయెను.

---

* Cf. "The removal of Jaffir was an illadvised measure; there was no absolute impossibility in his performing his engagements with the English, or paying his own troops, for both objects were speedilye accomplished by his successor, and he created no new resources......' Wilson, Mill and Wilson, Vol. III, p. 310.

† 'Cf. An idea, however, of fidelity to the connection which they had formed......prevailed in the breasts of the Council; and a middle course was chosen" Mill, Vol. III, P. 306.

మీర్జాఫరు రాజ్యభ్రష్టుఁడై వెడలినంతనే, మీర్కాశిము తత్సింహాసన మారోహించెను. కంపెనీ సేవకుల సంకల్పము సిద్ధించెను. వారికి ధనరాసులు లభించెను.

మీర్కాశిము సింహాసనాసీనుఁడైన పిదప నెట్టిపరిస్థితు లేర్పడెనో గమనింప వలసియున్నది.

---

# అ రా జ క ము

సురాజదౌలావంటి దుడుకుస్వభావుఁడును, మీర్జాఫరువంటి దుర్బలుఁడును గాక, సింహాసనారూఢుఁడైన మీర్ కాశిము పరిపాలనాధురంధరుఁడును, ఆర్థికశాస్త్రవేత్తయును, శాంతి సంస్థాపనాయత్త చిత్తుఁడును, కార్యదీక్షాపరతంత్రుఁడునై యుండెను. కాని, తన ప్రజల దుర్భరదారిద్ర్యమును, గర్హితమగు నాంగ్లసేవకుల ప్రవర్తనమును గుర్తించిన వాఁడగుటచే, నతిశీఘ్రముగ నాతనికిని ఆంగ్లేయులకును యుద్ధము సంభవించెను. అయ్యదే బక్సారుయుద్ధము.

సమర్థుఁడగు కాశిము రాజ్యాధిపతియైనంతనే, రాజ్యమున శాంతి నెలకొల్పుటకు వలయుమార్గ మన్వేషింపఁగడంగెను.

ధనసంచయ మొనరించినగాని శాంతి నెలకొనజాలదని గ్రహించి, తీవ్రప్రయత్నము లొనరించి కొంతద్రవ్యము గూడ దీసి, ఆంగ్లసైన్యములకుఁ జెల్లింపవలసియుండిన పైకమాతఁడు చెల్లించి, వాని నాతఁడు వశపఱచికొనెను. ధనమునకై తల్లడిలుచుండిన ఆంగ్లకంపెనీకిఁ దానొడఁబడినట్లు ఆ ఏడులక్షల పైకముగూడ జెల్లించెను.

తన యధికారమును ధిక్కరించు జమీందారుల గర్వమడంచుచు, తనకు రావలయు పన్నులు సుంకములు మొదలగు వానిని శ్రద్ధగా ఖచ్చితముగా వసూలుచేయుచు, ఒక్క కాసైనను అనవసరముగ వెచ్చింపక, మిక్కిలి వివేకముగఁ బ్రవర్తించుచుండిన మీర్కాశిము ఆంగ్లేయులకుఁ జెల్లింపవలసి యుండిన 79 లక్షల రూపాయలనుబూర్తిగాఁ జెల్లించివైచెను.* అటు లొనరించి, తనసైన్యమును జక్కగ సంస్కరించి, పరిపాలనావిధానమునందు వలయు సంస్కరణములను నాతఁడు ప్రవేశపెట్టెను. దేశము క్రమముగా నుచ్చదశకు రానుండెను. కాని, ధనాధికార బల గర్వములచేఁ గైపెక్కిన కంపెనీ సేవకుల నిరంకుశ ప్రవర్తనముచే నామహనీయుని ప్రయత్నమంతయు బూదిలోఁబోయు నాజ్యమువలె నిరర్థక మగుటయే గాక, తుద కాతఁడు రాజభ్రష్టుఁడు కూడ నాయెను.

ప్లాసీయుద్ధమున జయించుటచేతను, మీర్జాఫరును రాజ్యాధిపతి నొనరింపఁజాలుటచేతను, ఆనబాబు కేవలము వారిపై

* R. Mill—Vol. III P. 325.

నాధారపడి, కీలుబొమ్మవలెఁ దిరుగుచుండుటచేతను, వారినే విశ్వసించి వారిపై నాధారపడియుండిన మీర్జాఫరును మోస గించి హఠాత్తుగ రాజ్యభ్రష్టు నొనరించి మఱియొకని రాజ్యాధి పతి నొనరింపఁ జాలుటచేతను ఆంగ్లేయులు గర్వాంధులు కాఁజొచ్చిరి. మితిలేని ధనార్జన మొనరింపఁ గలుగుటచే గర్వాంధులగు నాఁటి కంపెనీసేవకులు మదాంధులుకాజొచ్చిరి. నబాబుయొక్క ద్రవ్యమునిచ్చు మదించు కంపెనీసైన్యములు సిద్ధముగ నుండుటచే, రాజ్యాధిపతియగు నబాబును ధృణీక రించుచు, అమాయికులగు జనులను పిండి పీడించుచు, వారు నిరంకుశముగ భయంకరముగఁ బ్రవర్తింపఁజొచ్చిరి.

దురహంకార స్వభావులగు నాఁటి యాంగ్లకంపెనీ సేవకు లలో 'ఎల్లిస్' * యను నాతఁ డొకఁడు. మీర్ కాశిము రాజ్యాధిపతియైన యనంతర మాతఁడు (ఎల్లిసు) పాట్నా నగ రమునందలి కర్మాగారమున కధికారి యాయెను. ఈతఁ డధికారము వహించినది మొదలు, నబాబుయొక్క రాజ్యాంగ మణుమాత్రమైనను గౌరవింపకుండుటయే గాక, రాజ్యాధిపతి యగు నబాబును సహితము గడ్డిపఱకకంటె హేయముగ జూడ నారంభించెను. †

* మీర్జాఫరును రాజ్యభ్రష్టునొనరించి మీర్కాశిమును రాజ్యాధి పతి నొనరించుటకు ఎల్లిసు బాధ్యుఁడు కాఁడు. కంపెనీపాలక వర్గములోని కొందఱితోఁబాటు నితఁడును అందులకుఁ బ్రతికూలుఁడై యుండెను.

† "He treated the Nabob with the most insulting air of authority, and broke through all respect for his government" —Mill Vol. III p. 322.

ఒకానొక సమయమున, కంపెనీ సేవకుఁ డొకఁడు నల్ల మందు గొనిపోవుచుండెను. ఆ నల్లమందు కంపెనీకిఁ జెంది యుండెనను నెపమున నబాబుయొక్క యధికారిని మోస గించి, సుంకము చెల్లింపకుండ దాటివేయవలయునని కంపెనీ సేవకుఁడు ప్రయత్నించెను. కాని, నబాబుయొక్క యధికారి ఆ మోసము గనిపెట్టి, యాంగ్లసేవకుని వారింపఁగడంగెను. తోడనే, యుక్తాయుక్తములను విచారింపక, రాజోద్యోగిని వెంటనే పట్టి బంధింపవలయునని మదాంధుఁడగు 'ఎల్లిసు' తన సైన్యాధిపతి నాజ్ఞాపించెను. కాని, ఎల్లిసుకంటె సైన్యాధి పతియే వివేకవంతుఁ డగుటచే నాతఁడు సరసముగఁ బ్రవర్తిఁ చెను. వెంటనే, ఎల్లిసుస్వభావము వేఱొకవిధమున వ్యక్త మాయెను. ఆంగ్లేయులపై మీర్జాఫరు పూర్తిగ నాధారపడి యుండినపుడు, క్లైవాతనిని బీడించి, సురేకారవ్యాపార మును స్వాధీనపఱచికొనిన విషయము పాఠకు లెఱింగియే యున్నారు. నాఁటినుండియు నాంగ్లేయు లావ్యాపారమున మంచి లాభ మార్జించుచుండిరి. కాని తాను రాజ్యాధిపతి యగుటచే నబాబు ఆంగ్లేయుల యడ్డంకి లేకుండ తనకు వలయు సురేకారము గొనిపోవుచుండెడివాఁడు. నబాబున కును ఆంగ్లేయులకును నాసందర్భమున నెట్టివివాదము రాకుండ కాలము గడుచుచుండెను. కాని, గర్వాంధుఁడగు ఎల్లిసుఁ డే తేరగనే రంగము మాఱిపోయెను. ఒకనాఁడు వాడుకప్రకా రము, నబాబుయొక్క ఉన్నతోద్యోగి యొకఁడు నబాబుతర

ఫునఁ గొంత సురేకారము గొనెను. తోడనే, ఎల్లిసుఁ డాజ్ఞాపింప, కంపెనీసైనికు లాతని బట్టి బంధించి సంకెలలువైచి, నబాబున కావిషయ మెఱింగింపకయే, కలకత్తానగరమున కాతనిఁ బంపివైచిరి. ఏపాప మెఱుంగని ఆ హైందవోన్నతోద్యోగిని కలకత్తానగరమున బహిరంగముగా కొరడాలతో బాదవలయుననియు, ఆతని చెవుల నుత్తరింపవలయు ననియును ఆంగ్ల సంఘసభ్యులు కొందఱు తీవ్రముగాఁ గోరిరి.* అట్టివారికిఁ జిక్కిన దౌర్భాగ్యున కెట్టిగతి సంభవించెనో దైవ మెఱుఁగు. ఎల్లిసుయొక్క దురహంకార స్వభావముం దెలుపు మఱియొక విషయముగూడ నుదాహరింతము. ఆంగ్లేయ సైనికు లిరువురు పాఱిపోయిరి. వా రిరువురును నబాబునకుఁ జెందియుండిన 'మాంఘ్గీరు' దుర్గమున దాఁచబడిరని ఎల్లిసుఁ డనుమానించెను. నిజముగా న య్యాంగ్లపాఱుబోతు లాదుర్గమున దాగియుండిరా, లేదా యని యతఁడు విచారింపలేదు. వారు నిజముగా నందు దాగియుండినను, రాజ్యాధిపతియగు నబాబున కావిషయము నివేదింపవలయును. కాని, ధూర్తుఁడగు ఎల్లిసు ధర్మాధర్మములను విచారించువాఁడు కాఁడు. దాగియుండిన ఆంగ్లసైనికులను మాంఘ్గీరుదుర్గాధిపతి తక్షణము తన యధీనము చేయఁడేని, దుర్గమునఁ జొరబడి నలుదెసలు శోధింపవలయునని యాజ్ఞాపించి, కంపెనీసైన్యము నొండు ఎల్లిసు

* "Some of the council insisted that he should be publicly whipped at Calcutta; others, that he should have his ears cut off"
Mill, Vol. III, p, 323.

పంపినవాఁడాయెను. ఆ సైన్యము మాంగ్హీరు చేరినంతనే, ఆ పురపాలకుఁడు వారి యుదంత మరసి, తన దుర్గమున నాంగ్లేయు లెవ్వరు లేరని వారి కెఱింగించెను. కాని, ఆంగ్ల సైనికు లాతని మాటను విశ్వసింపరైరి. వారిని సమాధాన పఱచుటకై యిరువురు సైనికోద్యోగులను లోనికిఁ గొంపో వుట కాపురపాలకుఁడు సమ్మతించెను. కాని, ఆంగ్లేయులింకను సంతసింపరైరి. కాఁబట్టి, చేయునది లేక, నబాబుయొక్క యనుమతి లేకుండ సాయుధులైయే తెంచు నాంగ్ల సైనికులను లోనఁ బ్రవేశపెట్టు టవివేకమని యెంచి, తోడనే తలుపులు బిగియించి, సమీపించు వారిపైఁ దుపాకులు ప్రయోగింతు నని పురపాలకుఁడు తెలియఁజఱచెను. పురపాలకుఁడు సమంజ సముగనే బ్రవర్తించెననియు, నబాబుయొక్క యనుమతి వడయకుండ ఆతని దుర్గమున జొరఁబడఁ గడంగు వారలే నేరస్థు లనియును ఎల్లరు గ్రహింపగలరు. కాని ఎల్లిసుమాత్రము వేఱుగ భావించెను. ఐనను, మీరు కాశిము తీవ్రపడుట పాడి కాదనియెంచి, కలకత్తా నగరమునందలి వర్తకసంఘాధ్యక్షున కావిషయ మెఱింగించెను. అపుడు నబాబుయొక్క యను మతిపై, నాయాంగ్లసంఘాధికారి మాంగ్హీరు దుర్గమును శోధించుట కొక సైనికోద్యోగిని నియోగించెను. కాని, ఆంగ్ల కంపెనీసేవకుఁడగు ఎల్లిసు దుష్ప్రవర్తనమే బహిర్గత మాయెను గాని, దుర్గమునం దెవ్వరును గానరారైరి.

అధికారులై, ధనికులై, బలవంతులై, గర్వాంధులై, మదాంధులైన కంపెనీసేవకులు పై నుదహరించిన తెఱంగున రాజ్యాధిపతియగు నబాబును దృణీకరించుటయేగాక, సస్యశ్యామాభిరామమగు బంగాళా దేశమును నిస్సారముగ నిర్జనారణ్యముగ నొనరించిరి. మేటి మొగలాయీ సామ్రాజ్యమునందలి రాష్ట్రములలోనెల్ల వంగదేశము మిక్కిలి ధనవంతమైనదని ప్రసిద్ధిగాంచి యుండెను. లక్ష్మీదేవి తమ నివాసార్థము దేశదేశములను వెదకి బంగాళా దేశమే తనకు నివాసయోగ్యమని కనుగొనినట్టు లసాధారణవైభవముతో నలరారుచుండిన యీ దేశము ధనాశాపరవశులై యుండిన కంపెనీసేవకుల దుష్ప్రవర్తనచే దారిద్ర్యదేవత కాలవాల మాయెను. నాఁటి జనులు పడిన పాట్లు వారే యెఱుంగవలయు; దైవ మెఱుంగవలయు; మనము మాత్రము చక్కఁగా గుర్తింపఁజాలము.

కల్పవృక్షమని ప్రసిద్ధిగాంచిన హిందూదేశముతో వ్యాపారమొనరించి ధనార్జన మొనరించుటకేగదా, ఆంగ్లేయు లేతెంచి యుండిరి. బంగాళా దేశమునందలి ఆంగ్లకంపెనీ సంఘాధికారులు నాఁటి మొగలాయీసార్వభౌముని దైన్యముగ వేడికొనుటచే, దేశమున నుండు చౌకీలకుఁ (ఆసీలు మెట్టులకు) సుంకములు చెల్లింపకయే ఎగుమతి వ్యాపారముల నొనరించుటకు వారి కొకఁ డనుజ్ఞ నొసంగెను. అందులకు కంపెనీవారు సంవత్సరమునకు మూఁడువేలరూపాయలు చెల్లించుట కియ్య

కొనిరి. నాఁటినుండియు, కంపెనీ సంఘాధ్యక్షుని సంతకము గల యధికారపత్రము కంపెనీసేవకులు ప్రదర్శించుచు, సుంకము జెల్లించు నవసరములేక నిర్విఘ్నముగ వ్యాపార మొనరింపుచు, కంపెనీకి విశేషలాభము గూర్చుచుండిరి. ఇట్టి సదుపాయము కంపెనీకి మాత్రమే చెందియుండెననియు, నావలపై నితరదేశములనుండి దిగుమతియగు సామానులకు బంగాళా దేశమునుండి పై దేశముల కెగుమతియగు సామానులకును మాత్ర మన్వయించుననియు పాఠకులెఱుంగవలయును.

ఇట్టి సత్వము నాంగ్లేయులకు దయచేసి తానొక విష బీజమును నాటియుంటిననియు, బంగాళాదేశస్థులను దహించు విషవృక్షముగ నయ్యది పరిణమించుననియును ఆ పాదుషా యెఱుంగఁజాలడాయెను.

కంపెనీతరపున వ్యాపార మొనరించుచుండిన ఆంగ్లేయులు తాముకూడ సొంతముగ వ్యాపార మొనరించి లాభమార్జింప వలయునని వాంఛించిరి. ఆ దేశమున వ్యాపార మొనరించు చుండిన వర్తకులవలె సుంకములను జెల్లించుచు వారు లాభ మార్జింపఁగడంగి రేని, ఒకవిధముగ బాగుండెడిది. అట్లుగాక సుంకము లీయనిచో హెచ్చులాభ మొదవునని యెంచి, తమ సంఘాధికారియొక్క సంతకము బ్రదర్శింపుచు, నబాబు యొక్క యధికారుల కండ్లు గప్పివేయుచు, ఆంగ్లసేవకులు ధనవంతులు కాఁజొచ్చిరి. కాని, వివేకవంతుఁడగు నవాబు వారి మోసము గనిపెట్టి వారివలనఁ దన ప్రజలకుఁ

గలుగు నష్టము గుర్తించి, ఆంగ్లేయుల దురాచారములను వారించునపుడు మాత్రము తమ వ్యాపారము వారు త్యజింప వలసినవారగుచుండిరి. దేశాధిపతులను ధిక్కరించి స్వైర విహారమొనరించు కాల మింకను కొంతదూరమున నుండుటచే, వారు ప్రతీకార మొనరింపఁ జాలరైరి.

కాని, ప్లాసీయుద్ధకారణమున నొక గొప్పపరివర్తనము జరిగియుండెను గదా. నవాబులను ప్రసన్నులఁ జేసికొనుటకై దైన్యముగ మెలంగుచుండిన ఆంగ్లేయులు నాఁటగోలె నవా బును గడ్డిపఱకకంటె నికృష్టముగఁ జూచుచు విచ్చలవిడిగఁ బ్రవర్తింపఁజొచ్చిరి. రాజ్యాధిపతి వారి యధీనమున నుండు టచే, వారిని నిరోధింపఁగలవారు లేకపోయిరి. తోడనే, వారి ధనాశ విజృంభించెను. సుంకములు చెల్లింపకుండ వ్యాపార మొనరించి లాభమార్జించి కుబేరులై నిజదేశమున కరగి, తమ దేశస్థుల కండ్లెఱ్ఱనగునట్లు వైభవసమన్వితులై సుఖజీవన మొనరింపవలయునని వారు వాంఛించిరి. వారట్లు దురాశా పరవశులై యుండుటచే, తమవలన హైందవ వర్తకులకును, ప్రజలకును, నవాబునకును గలుగు నష్టము తలంపరైరి.

నిర్మలాకాశమున మొదట దృశ్యాదృశ్యముగఁ దోఁచు మేఘము క్రమక్రమముగాఁ బెరిగి పెరిగి, యాకసమంతయు నావరించి, భయంకరాకారము దాల్చి, తుదకు సంతతధారా పాతముగ ఝరీవేగమున వర్షించి, మార్గమధ్యమునఁ జిక్కు

వడుపాంథులను క్రూరముగ బాధించునట్లు; ఆంగ్లేయులు ప్రారంభమున ధనార్జనము మితముగ నారంభించి, అన్యాయార్జితవిత్తమును జవిఁజూచుకొలఁది వారి ధనతృష్ణ తీక్ష్ణమగుచుండుటచే, న్యాయాన్యాయములను గణింపక, శక్తివంచనలేకుండ, ప్రతి వ్యాపారమునందును జొరఁబడుచు, దేశమంతటను వ్యాపించి, చెల్లింపవలసిన సుంకము లెగవేయుచు ధనవంతులు కాఁజొచ్చిరి. తుదకు నూనె, చేపలు, వరిగడ్డి, వెదుళ్ళు, బియ్యము, ధాన్యము, తమలపాకులు, పోకలు లోనుగాఁగల సమస్త పదార్థములతోడను ప్రతి జిల్లాయందును, ప్రతి గ్రామమునందును, వారుగాని, వారి యనుచరులుగాని వ్యాపారమొనరింపఁదొడంగిరి. నదులపైఁబోవు ప్రతి నావయందును ఆంగ్లేయపతాక మెగురుచుండెను. ఇంతటి వ్యాపారము సుంకములు చెల్లింపకుండ ఇంత విరివిగ నాంగ్లేయులు సాగించుచుండుటచే, రాజ్యాధిపతియగు నబాబున కెంతటి నష్టము వాటిల్లునో పాఠకులు గుర్తింతురుగాక. వా రెట్లు ప్రవర్తించుచుండినను, హైందవ వర్తకులు మాత్రము యథావిధిగ సుంకములు చెల్లింపవలసియుండుటచే, వారి యవస్థ యెంత దుర్భరముగ నుండెనో గూడ పాఠకులు గుర్తింతురు గాక. సుంకము లెగవేయు నాంగ్లసేవకులతో, సుంకములు చెల్లించు హైందవులు సరిగా వ్యాపార మొనరింపఁ జాలరనియు, అట్టి పరిస్థితులయందు దేశీయవ్యాపార మాంగ్లేయుల వశమగుననియు గూడ పాఠకులు గ్రహింతురుగాక.

ఆంగ్లేయుల ప్రవర్తన మా తెలుంగున దుస్సహాముగ నుండినను, వారి కింకను సంతుష్టి లేకపోయెను. ధనము లభించుకొలఁది వారి ధనాశ మఱింత తీక్ష్ణము కాఁజొచ్చెను. * ధనాశచేఁ బారవశ్యులై, అంధులై మిన్నుమన్ను గానక ప్రవర్తించు నాంగ్ల కంపెనిసేవకు లొక యుపాయ మాలోచించిరి. తాము కొను సామానులు హీనక్రమమునకు లభించునేని, లాభ మధికమగునని వారు కనిపెట్టిరి.

అట్టి ధనాశకుఁ జిక్కిన కంపెనీసేవకులు హేయముగఁ బ్రవర్తింప నారంభించిరి. తమకు వలయు సామానులను సగము వెలకు నొసంగవలయుననియు, నాల్గవవంతు† వెలకే యొసంగవలయుననియు నాంగ్లసేవకులు జనులను నిర్బంధింపఁ దొడంగిరి. అట్టి హీనక్రయమునకుఁ దమ సామగ్రిని సమర్పింపవలసిన పనివాం డ్రెట్లు జీవింపగలరు ? వారికి జీవించుటకు వలయు లాభమైనను లేకుండుటయేగాక, నష్టము

---

* Cf. "The sudden affluence thrust upon the Calcutta community by the lavish compensation paid for the losses sustained.........turned the heads of all, led to a scramble for riches which brought into painful prominence the evil features of human nature, Gentlemen...... were tempted to sell their souls for gain........." V. A. Smith, p. 497.

† They forcibly take away the goods and commodities of the Reiats, Merchants, etc., for a fourth part of their value; and by ways of violence and oppressions they oblige the Roiats, etc., to give five rupees for goods which are worth but one rupee......"

Quoted by R. C. Dutt ("India under the early British rule", p. 23) from Meer Kasim's letter, May 1762.

సహితము వారు భరింపవలసినవా రగుచుండిరి. ఐనను, దొరలకు వలయు సామానులను దయారుచేసి దేశస్థులు సమర్పింపవలసివారైరి. ఆంగ్లేయుల పీడన మెంత దుర్భరముగ నుండినను, జనులు భరింపవలసియుండెను. పదార్థములు తయారుచేయుట మానివేయుటకైనను, అవకాశము లేకపోయెను! తమకు వలయు పదార్థములను దమకు వలయు నతి చౌకధరలకు నొసంగని జనులను బట్టి బంధించి, ఆంగ్లసేవకులు కొరడాలతో బాదఁ గడంగిరి. అంతటితోనైనను, వారి ధనతృష్ణ తీరదాయెను. సామగ్రిని సగము ఖరీదునకును నాల్గవవంతు ఖరీదునకును గొనుటచేఁ గలుగు లాభము కూడ వారికిఁ జాలదాయెను! సరుకును నాల్గవవంతు ఖరీదునకుఁ గొనునట్టులే, వానిని బజారుధరలకంటె నాలుగైదురెట్లు ఖరీదునకు విక్రయించినచో నమితమగు లాభము లభించునని ఆంగ్లసేవకులు భావించి, అట్లు లాచరించిరి! తాము చెప్పు ఖరీదులకుఁ దమ సామానులను కొనని జనులను గూడ వారు పట్టి బంధించి శిక్షింపఁ నారంభించిరి. అంతటితోనైనను వారు విరమించిరా? వారు విక్రయించు సామానుల నెవ్వరైన విక్రయింతురేని, వారినిగూడ బట్టి శిక్షింపమొదలిడిరి!

అట్టి యాగడము లొనరించు నాంగ్లసేవకులను నబాబు యొక్క యధికారు లెవరైనను వారింపఁ గడంగిరేని, తదధి

కారులను సహితము పట్టి బంధించి శిక్షించుచుండిరి.* ఈ తెఱంగున నబాబుయొక్క ప్రజలును, ఆతని యధికారులును మాత్రమే గాక, దేశమునందలి ఉన్నతవంశ సంజాతులగు జమీందారులుగూడ, నాంగ్ల సేవకుల దురాగ్రహానల జ్వాలలకు నాహుతి యగుచుండిరి. వారి వాతఁబడి పడరాని పాట్లు పడుచుండిన జనుల దుస్థితిఁ గాంచి భరింపఁజాలక అడ్డుపడఁగడంగు జమీందారులను జడిపించుచు, బంధించుచు, శిక్షించుచు, వారిపై నేద్దియో నింద వైచుచు వారి వద్ద ధనము పిండఁగడంగిరి. † తుదకు నాంగ్లకంపెనీసేవకు లరుదెంచుచుండిరని తెలియునంతనే, గ్రామస్థులు భయ విహ్వలులై, ప్రాణములు దక్కిన చాలునని యెంచి, రయమునఁ బలాయన మొనరింప నారంభించిరి.♦

* Cf— "When the collectors of these tolls, or transit duties. questioned the power of the dustuck and stopped the goods; it was customary to send a party of sepoys to seize the offender and carry him pri. soner to the nearest factory"—Mill, Vol. III, p. 327.

"English agents or gomastahs, not contented with injuring the people, trampled on the authority of government, binding and punishing the Nobob's officers whenever they pre sumed to interfere. This was the immediate cause of the war with Meer Kasim."—
Quoted by Mill (Vol. III, p. 329) from Verelst's 'View of Bengal.'

† Cf.— "......they even pass sentences on the Zamindars themselves, and draw money from them by pretended injuries......"
Quoted by R. C. Dutt.—p. 24 a nd Mill—Vol. III. p. 331.

♦ Cf.—"and most of the petty towns and serais were deserted at our approach, and the shops shut up from the apprehensions of the same treatment from us" — Hastings.
Quoted by Mill, Vol. III. p. 329.

నాఁటి యాంగ్లకంపెనీ సేవకుల కారణమునఁ జెలరేఁగిన యరాజకదావానలమునకు హైందవులు సహితము దోహద మొసంగిరి. స్వార్థపరులును, కఠినాత్ములును, పాపాత్ములును దేశద్రోహులును అగు హైందవవర్తకులు కంపెనీసేవకునకు లంచము లొసంగి, వాని యనుమతి వడసి, వానిపేరున వ్యవహరించుచు దీనులగు జనులను క్రూరముగ బాధింపఁగడంగిరి.

ఆ దేశస్థులు కఠినులగు పాలకుల క్రౌర్యము చవిచూచి యుండిరి; కాని ఇట్టి క్రౌర్యమునకు మాత్రము వారెన్నఁడును గుఱియై యుండలేదు: అయ్యది కేవలము రాక్షస ప్రభుత్వము వలె నుండెనని 'మెకాలే' ప్రభువు వ్రాసి యున్నాఁడు. *

తుదకు, ఆంగ్లకంపెనీ సంఘాధికారియగు వాన్సిటార్టును, సంఘమునందలి యొకసభ్యుఁడగు హేస్టింగ్సును గూడ తమ దేశస్థులు దుష్టప్రవర్తనము గాంచి సహింపఁజాలక పోయిరి. నవాబు శాంతము వహించుగొలది తమ దేశస్థులు చెల రేఁగుచుండుటచే, తుద కాతఁడు విసిగి వేసారి యుద్ధసన్నద్ధుఁడగునని వాన్సిటార్టు భావించెను. కాఁబట్టి, ఆతని చెంత కేగి, సందర్భోచితముగ ముచ్చటించి, ఆతనిని శాంతపఱచి, తమకు లాభకరమగు శాంతిని నెలకొల్పవలయునని యెంచి, వాన్సిటార్టు

* R. They had been accustomed to live under tyranny, but never under tyranny like this."

Macaulay—Essay on 'Clive'

R— "It resembled the government of evil Genii, rather than the government of human tyrants".

Macaulay.

హేస్టింగ్సు లుభయులుం గలసి ప్రయాణమై మూంగ్గీరు నగరమున నుండిన మీర్కాశిమును దర్శించిరి.

ఆంగ్లేయుల ప్రవర్తనముచే దందహ్యమానమానసుం డయ్యు, కాశిము శాంతిస్థాపనాయత్త చిత్తుండై, యేతెంచిన ఆంగ్లనాయకులకు సగౌరవముగ, సవినయముగ నాతిథ్యమొసంగెను. వారి నట్లు గౌరవించిన పిమ్మట, ఆంగ్లసేవకుల దుష్ప్రవర్తనముచేం దనకును తన ప్రజలకును కలిగిన మహోపద్రవము నాతం డభివర్ణించెను. ఇంకనైనను, ఆంగ్లేయులు ధర్మబద్ధులై మెలంగుట కిచ్ఛగింతురేని, వారొనరించిన దౌష్ట్యములను దాను స్మరింపనని నబాబు తెలియంబఱచెను. ఆంగ్లేయులు దేశీయ వర్తకమునం బాల్గొనుట కేవల మధర్మమని యాతం డెఱింగించెను: ధర్మపథము దప్పి మోఱకులై అంగ్లేయులు దైశిక వర్తకమునం జొఱంబడుటచేం దన రాజ్యాంగమనేక తెఱంగుల విచ్ఛిన్నమాయెనని ఆతండు వ్యక్తీకరించెను. దేశమునందలి వ్యాపారమునం బాల్గొనుహక్కు తమకు లేదని కంపెనీ గవర్నరగు వాన్సిటార్టు సహిత మంగీకరించెను. కాని, అనుభవించుచుండిన హక్కును విడనాడుటకు మాత్ర మాతం డంగీకరింపండాయెను.* అందలి పరమార్థమేమన – తమ

* Cf—" Mr. Vansittart. though fully aware, as he himself declares that the interior trade, which had been grasped by the company's servants, was purely usurpation, was yet, he says, " unwilling to give up an advantage which had been enjoyed by them, in a greater or less degree, for five or six years.''

Mill, Vol. III—p. 333.

ప్రవర్తనము న్యాయవిరుద్ధముగ నుండినను, లాభకరమగు వ్యాపారము విడనాడుట కాతఁడు సమ్మతింపడాయెను.† కాఁబట్టి, ఆవిషయమై, ఆతఁడును నబాబును గలసి చాలదూరము విచారించిరి. తుదకు, ఆంగ్లేయులు కూడ బంగాళా దేశస్థుల వలె సుంకములు చెల్లించుచు వ్యాపారమొనరించుటకు నబాబు సమ్మతించెను. ఆతఁడటు లొడంబడినను, వాన్సిటార్టు సంతుష్టుడైనట్లు కానరాదు. ఎట్లులైనను దేశమున శాంతి నెలకొల్పి తన ప్రజల నుద్ధరించుటకై తత్తరపడుచుండిన మీర్కాశి మాంగ్లేయులకు గొప్ప సదుపాయము చేయుట కియ్యకొనెను. బంగాళా దేశస్థులు మొత్తముమీఁద 100 కి 25 చొప్పున సుంకములు చెల్లించుచుండిరని చెప్పవచ్చును. కాని ఆంగ్లేయులు 100 కి 9 చొప్పున సుంకములిచ్చినఁ జాలునని నబాబు సమ్మతించెను : ఆతని యౌదార్యము గాంచి వాన్సిటార్టు సంతుష్టాంతరంగుఁడై నబాబు సెలవుగైకొని కలకత్తానగరమునకుఁ బోయెను.

కాని, బంగాళా దేశధనము దినుచు మదించిన ఆంగ్లకంపెనీ సంఘసభ్యులకు వాన్సిటార్టు ప్రవర్తన మంతయు మిక్కిలి

---

† కంపెనీ యుద్యోగులందఱు, నీ గర్హిత వ్యాపారమునఁ బాల్గొనుచుండిరి. సాధారణోద్యోగులే గాక. కంపెనీ ప్రభుత్వసంఘసభ్యులలో నధిక సంఖ్యాకులు గూడ నావిధమున ధనార్జన మొనరింపుచుండిరి. కాఁబట్టి వాన్సిటార్టు అవస్థ విషమముగ నుండెను.

యసహ్యాకరముగ నుండెను.* తాము నిర్ణయించు నతిచౌకధరలకు సరకులు కొనుచు, తాము నిర్ణయించు విపరీతపుధరలకు వానిని విక్రయించుచు దోపిడిచేయుచుండిన మహానీయులకు సుంకము చెల్లించుటయే కష్టముగ నుండుటచే, వారు వాన్సిటార్టుపై నాగ్రహావేశ పూరితులైరి. దైశిక వ్యాపారమునఁ బాల్గొను హక్కు తమకుఁ గల దనియు, తమ సరకులపై సుంకములు విధించు నధికారము నబాబునకు లేదనియును వారు తీర్మానించిరి. రాజ్యాధికారియగు నబాబునకే సుంకములు విధించు నధికారము లేదని నిరూపించుటయు, ఆంగ్ల కంపెనీ సంఘసభ్యు లట్లు తీర్మానించుటయును మిక్కిలి సాహసము. కేవలము హాస్యాస్పదము. అట్లు తీర్మానించి, తొంటియట్లు నిరంకుశముగ సుంకముల నెగవేయుచు వ్యాపారములను సాగింప వలయుననియు, తమ వ్యాపారమున కెట్టి యడ్డంకియైనను గలిగింప సాహసించు నబాబుయొక్క యుద్యోగులను బట్టి బంధింపవలయుననియు దేశమున నుండు తమ కర్మాగారాధ్యక్షులకు వారు తెలియఁబఱచిరి.

గవర్నరగు వాన్సిటార్టు యొడంబడినట్లు ఆంగ్లేయులు ప్రవర్తింతురని మీర్కాశిము భావించెనేగాని, వారట్టి హేయమగు తీర్మానము లమలు చేయుదురని యెఱుంగఁజాలఁడాయెను. తమ దుర్వ్యాపారములను వారింపఁగడంగు హైంద

---

*Cf.—"Greedy of gain, careless of the public interest, they refused to ratify the agreement......"

Col. Malleson's "Decisive battles of India". P. 138.

వారోద్యోగులను బట్టి, కంపెనీ యధికారులు తీవ్రతరముగా బాధింపఁదొడంగిరి. పరదేశాగతులగు నాంగ్లేయులును వారి సేవకులును సుంకములు నెగవేయునపుడు, సుంకములు చెల్లించుట తన ప్రజలకు మిక్కిలి దుర్భరమని గుర్తించి, వారు మాత్రము సుంకముల నేల చెల్లింపవలయునని వితర్కించి, వారుకూడ సుంకములను జెల్లింపనక్కరలేదని చాటించి, చౌకీల నన్నింటిని మీరాస్కాశిము తీసివైచెను. ఆకారణమునఁ దనకుఁ జాల నష్టము కలుగునని యాతఁడెఱింగి యుండెను. ఐనను, సహసశీలుఁడగు నబాబు కంపెనీసేవకులను శిక్షింప నోల్లక, తనప్రజల దుర్భరస్థితి గాంచి సహింపఁజాలక యటు లాచరించెను.

నబాబు ప్రవర్తనము మిక్కిలి యుదారముగ, మిక్కిలి శ్లాఘనీయముగ నుండెనని యెల్లరు గ్రహింపఁగలరు. కాని, కేవలము స్వార్థపరులై యుండిన కంపెనీసేవకులు న్యాయమును లజ్జను బూర్తిగ విడనాడిరని, చరిత్రకారుడగు 'మిల్లు' వ్రాసియున్నాఁడు.* ఆంగ్లేయులకును తన ప్రజలకును లాభనష్టములు సమానముగ నుండవలయునని యెంచి నబాబు అట్లాచరించెను. కాని, తమవలె హైందవులు కూడ సుంకములు చెల్లింపకుండ వ్యాపారమొనరింతురేని, తమ లాభ

* Cf.— "The conduct of the company's servants, upon this occasion, furnishes one of the most remarkable instances upon record of the power of interest to extinguish all sense of justice, and even of shame." Mill— Vol. III, p. 337.

ములు తగ్గును. కావున, వార లత్యుగ్రులై, తనప్రజలపై నబాబు సుంకములు విధింపవలయునని ఆంగ్లకంపెనీ సంఘ సభ్యు లాజ్ఞాపించిరి. కంపెనీసేవకులు న్యాయవిరుద్ధముగ సుంకములనెగవేసి వ్యాపార మొనరింపఁ బూనుటయే యధమము; అట్టియెడ, నబాబు ప్రజలు సుంకములను జెల్లింపవలయునని వారు శాసించుట అధమాధమము.

తుదకు నిరుతెగలవారును యుద్ధసన్నద్ధులైరి. ఈసందర్భమున నొకవిషయము గమనింపవలసియున్నది. మిర్జాకాశిము సింహాసనారూఢుఁడైన సందర్భమున, బహుమానముల నెపమున లంచములు కుడిచిన యాంగ్లకంపెనీ సంఘసభ్యులు కొందఱు తమదేశమున కరగియుండిరి. వారి స్థానమున నాసంఘమునఁ బ్రవేశించిన వారలు, తమకెన్నఁడు ధనరాసులు లభించునో, తామెన్నఁడు నబాబును దోచుకొనఁగలుగుదుమో యని తత్తరపడసాగిరి. అట్లు ధనాశాపరవశులై యుండిన యాంగ్లసేవకులకు కాశిముయొక్క సత్పరిపాలనము కడు నసహ్యకరముగ, కడు దుస్సహముగఁ గాన్పించెను. ఆమహానీయుఁడు రాజ్యభ్రష్టుఁడైనఁ గాని తమదురాశలు ఫలింప నేరవని యెంచి, వేయి విధంబుల నాతనిగారించి, యాతని నెట్టులైనను యుద్ధరంగమున కీడ్వవలయునని పరిపాలనాధురంధరులగు నాసభ్యులు నిశ్చయించిరి.* మఱియు, మిర్జాకాశిముతో యుద్ధము సంభవించునేని, ఆతనితోడి సంధికి మాత్ర

* Cf.—Malleson's "Decisive batules",—p. 143, 4.

మొదఁబడరాదనియు, వానిని రాజ్యభ్రష్టు నొనరించి మఱి యొకని రాజ్యాభిషిక్తు నొనరింపవలయు ననియును వారలు కృతనిశ్చయులై యుండిరి * సస్యముల మధ్యమునను, ఫల వృక్షముల మధ్యమునను 'దిష్టిబొమ్మ' ను వ్రేలాడఁగట్టి దృష్టి దోషమును దొలగించి, ఫలసాయమును బూర్తిగ ననుభవించు కర్షకునివలె, మానవ విగ్రహము నొండు సింహాసనముపైఁ బ్రతిష్ఠించి, జనుల కండ్లుకప్పి, నిరంకుశముగ ధనార్జన మొనరింపఁగోరిన ఆంగ్లకంపెనీ సేవకులకు, శ్లాఘనీయమగు కాశిము యొక్క సత్పరిపాలనము కడుంగడు దుస్సహముగ నుండెనే! కాఁబట్టి, తమచేఁ బరాభవింపఁబడిన మీర్జాఫరునే మఱల రాజ్యాధిపతి నొనరింపవలయునని వారు యోచించిరి. మీర్జాఫరు బలహీనుఁడును ముదుసలియు నై యుండుటచే, తమ దుర్వ్యాపారములు నిరాఘాటముగ సాగునని వారు గ్రహించియుండిరి. వారు విధించిన షరతులకన్నింటికిని ఆ చీకుఁఱేడు ఒడంబడెను. ఉప్పుమీఁద మాత్రము 100 కి 2½ చొప్పునతప్ప, ఆంగ్లవర్తకులవద్ద సుంకములు వసూలు చేయకుండుటకును, తన ప్రజలుమాత్ర మెప్పటి యట్లు సుంకములు చెల్లింపవలయునని శాసించుటకును ఆతఁడు సమ్మతించెను. 12,000 ఆశ్వికదళమును, 12,000 కాల్బలమును ఎల్లప్పుడు భరించుటకు సహిత మాతఁ డంగీకరించెను. మీర్కాశిము రాజ్యాధిపత్యము వహించినపుడు, ఆంగ్లసైన్యములకగు

---

* R.— Mill, Vo,. III, p, 343.

ఖర్చులనిమిత్తము, సారవంతములగు బర్ద్వాను, చిట్టగాంగు, మిడ్నాపూరు జిల్లాలు వారి యధీనమై యుండెనుగదా. వానిని మీర్జాఫరు కాయపఱచుటయేగాక, యుద్ధము ముగియువఱకును మాసమునకు 5,00,000 రూపాయలు చెల్లించుటకు గూడ నాతఁడొడంబడ వలసిన వాఁడాయెను. యుద్ధపుఖర్చుల క్రిందను, కంపెనీకిఁ గలుగు నష్టముక్రిందను 30,00,000 రూపాయలు చెల్లించుటకుగూడ నాతఁడొడఁబడెను. కంపెనీకే గాక, కంపెనీసేవకులకు సహితము కలిగిన నష్టమును భరించుటకుఁ గూడ నాతఁ డియ్యకొనవలసిన వాఁ డాయెను. ఆవిషయమై యాతఁడు చెల్లింపవలసిన పైకము 10,00,000 రూపాయలకు మించి యుండదని కంపెనీ సంఘసభ్యు లాసమయమునఁ దెలియఁబఱచిరి; కాని, మీర్జాఫరు రాజ్యాధిపతియైన పిదప, తమకు రావలసిన పైకము 20,00,000 రూపాయలనియు పిమ్మట 30,00,000 అనియు, అటుపిమ్మట 40,00,000 అనియును నిరూపించి, తుదకు 53,00,000 రూపాయలని వారు నిర్ణయించిరి. * ఈ మొత్తములుగాక, సైన్యమునకుఁ బ్రత్యేకముగా 25,00,000 రూపాయలును, అందు సగము

---

* "That demand, however, was soon after stated at 20,00,000 then at 30,00,000, afterwards at 40,00,000, and at last was fixed at fifty three lakhs of rupees. We are assured by the director of the company, "That all delicacy was laid aside in the manner in which the payment was obtained for this sum, of which seven-eights was for losses sustained or, said to be sustained, in an illicit monopoly of the necessaries of life." Mill—Vol. III—p.355.

పైకము నావికాదళమునకును నోసంగుటకుఁ గూడ నావృద్ధరా జంగీకరించెను.

తొల్లి, తనకుఁగలిగిన భంగపాటును దలంపక, దౌర్భాగ్యుఁడగు మీర్జాఫరు పై నుదహరించిన విషమపరతుల కొడంబడి, మఱల సింహాసనము నారోహింప నుద్యుక్తుఁడాయెను.

---

# బక్సారు యుద్ధము

ఆంగ్లకంపెనీసేవకుల సాహాయ్యముచేఁ దాను వంగదేశ సింహాసన మారోహించినప్పుడే, వారి నైజము మీర్కాశిము చక్కఁగ గుర్తించియుండెను. వారు దురాశాపరులనియు, విశ్వసనీయులు కారనియు నాతఁ డెఱింగియుండెను. వారినే విశ్వసించి, వారిమీఁదనే యాధారపడియుండిన మీర్జాఫరున కెట్టి దురవస్థ ప్రాప్తించెనో ప్రత్యక్షముగ గోచరించుచుండుటచేత దా నట్టి యవివేక మొనరింపరాదని యాతఁడు నిశ్చయించుకొనియుండెను. పాతకములలో నెల్ల ఋణపాతక మతి దారుణమైనదని యెంచి, ఆ పాతకము చేతనే మీర్జాఫరు దుర్భరాంగ్లపాశబద్ధుఁ డాయెనని గ్రహించి

తన రాజ్యాంగము సంస్కరించుకొని, వారికిఁ జెల్లవలసి యుండిన పైకమును బూర్తిగ మీరుకాశిం జెల్లించివైచెను.

పరాధీనము సహింపఁజాలని పోటుమానిసియగు కాశిమునకు ముఖ్యముగ సైన్య మవసరమైయుండెను. పాశ్చాత్యశిక్ష వడసిన కంపెనీ హైందవసైన్యములు రణరంగములయందుఁ బ్రదర్శించిన కౌశల్యమును గాంచియుండినవాఁడగుటచే నాతఁడు పాశ్చాత్యసేనానులను జేరదీసి, వారికిఁ బ్రత్యేక సౌకర్యముల నేర్పఱచి, వారి సాహాయ్యముచేఁ దన సైన్యము నుచితభంగి సంస్కరించెను. మఱియు, నాతఁడు లోకానుభవము గల కార్యశూరుఁ డగుటచేత, పిరంగులను దయారు చేయుట కొక కర్మాగారము కూడ నిర్మించెను.

నిరంకుశవిహార మొనరించు నాంగ్లకంపెనీ సేవకులకు దూరముగ నుండుటయే క్షేమకరమని యెంచి, చిరకాలము నుండి రాజధానిగనుండిన మూర్షదాబాదునగరము వీడి, యాతఁడు మాంఘీరునగరమును దన రాజధానిగా నొనరించుకొనెను.

మీర్కాశిము సంగ్రామప్రియుఁడని భావింపరాదు. ఆతఁడు రణవ్యాపార పారంగతుఁడని నిర్వచించుటకు మాత్రము సందియము లేదు. ఆతఁడు మహాభిమానియనియు, ప్రజాభిమానియనియు, స్వాతంత్ర్యప్రియుఁడనియు నెల్లరు నంగీకరింపవలయు. పరదేశాగతులగు నాంగ్లేయులను విశ్వసించి, వారి మీఁదనే యాధారపడియుండిన తన మామగారి కెట్టి దురవస్థ

ప్రాప్తించెనో గాంచినవాఁ డగుటచే నాతఁ డాత్మసంరక్ష ణార్థమే యట్టి ప్రయత్నము లొనరించెను. ఆంగ్లకంపెనీ సేవకుల కారణముననే తనకు రాజ్యాధిపత్యము ప్రాప్తించియుండుటచేఁ దా నొడఁబడినట్లు వారికిఁ జెల్లింపవలసిన ధనరాసుల నెల్ల జెల్లించి యాతఁడు ఋణవిముక్తుఁడాయెను. కాని, వర్తకమునకై యేతెంచిన కంపెనీసేవకులు తాము గడించిన హక్కులను ననుభవించు వర్తకము మీఁదనే దృష్టి నిలుపవలయును గాని, తనపై వారు స్వారిచేయుట కవకాశ మొసంగ రాదని యాతఁడు కృతనిశ్చయుఁడై యుండెను. కాని, రాజ్యాధిపతికిఁ నుచితమగు స్వాతంత్ర్యము నిలిపికొనఁగడంగు నబాబునకును, ధనాశాపరవశులై నిరంకుశవిహార మొనరించు కంపెనీసేవకులకును సఖ్య మెట్లు కుదురును?

మీర్కాశిము నలుబదివేల సైన్యమున కధినాథుఁడై యుండెను. అందలి పెక్కు సైన్యములు పాశ్చాత్యశిక్ష వడసి యుండెను. ధూర్తులగు నాంగ్లకంపెనీసేవకులవలనఁ దన కెన్నడైనను ముప్పు వాటిల్లునని గ్రహించినవాఁ డగుటచే, నాత్మసంరక్షణార్థ మాతఁ డెల్లపుడు మెలకువగనే యుండెను. సైన్యవ్యవస్థలయం దాతఁడు మిక్కిలి కుశలుఁ డగుటచే, యుద్ధరంగమున సైన్యాధిపత్యము వహించుటకుఁగూడ జాలి యుండెను. ఐనను, చివరవఱకు నాతఁ డతి సహనముగ నుండెను. కాని, తాను సహించుకొలఁది ఆంగ్లసేవకులు చెల

జేయుచుండుటచే నాతఁడు చేయునది లేక రణ మాచరింప వలసినవాఁ డాయెను.

ధూర్తుఁడగు ఎల్లిసుయొక్క ప్రవర్తనము పాఠకులు గమనించియే యున్నారు. ఈ కంపెనీ సేవకుని కారణముననే యుద్ధముగూడ ప్రారంభ మాయెను ( 23 జూను, 1763 ).

పరిస్థితులు మీరాక్కాశిమునకుఁ బ్రతికూలముగ నుండినట్లు గోచరించును. ఆతనిరాజధాని కడుదూరముగ నొక మూల నుండుట యొకటి: కంపెనీసేవకుల గర్వితనిరంకుశ ప్రవర్తనముచే నాతని రాజ్యాధికారము విచ్ఛిన్నమై యుండెను. ఈ కారణమునను, చివరవఱకు నాతఁడు శాంతి నెలకొల్పవలయు ననియే తత్తరపడుచుండుటచేతను, యుద్ధ మాకస్మికముగ నారంభమగుటచేతను మఱింత సైన్యము గూడదీయుట కాతని కవకాశము లేకపోయెను. మఱియు, నాంగ్లేయులు మీర్జాఫరును సింహాసనాసీను నొనరించుట గూడ కాశిమునకు మిగుల హానికరముగ నుండెను.

ఐనను మీరాక్కాశిము జయప్రదముగ నారంభించెను. ఎల్లిసు మొదలగువారల మద మడంచి, వారి సైన్యములను తుత్తునియ లొనరించి, వార లాక్రమించిన స్థలముల నాతఁడు స్వాధీనపఱచికొనెను. ఈలోపున, దేశద్రోహులలో నెల్ల నగ్రగణ్యుఁడని చెప్పఁదగు మీర్జాఫరును, ఆతనిఁ గీలుబొమ్మవలెఁ ద్రిప్పుచుండిన ఆంగ్లేయులును యుద్ధసన్నద్ధులై బయల్వెడలిరి.

మీర్జాఫరు తమ చెంతనుండిన కారణమునఁ గలుగు పలుకుబడి చేతను, పాశ్చాత్యశిక్ష సహజముగా శ్రేష్ఠతరమైన దగుట చేతను నాంగ్లేయులు బలవంతులై యుండిరని చెప్పవచ్చును.

భగీరథీనదీతీరమున నున్న 'అగర్దివి' సమీపమున నిరు తెగలవారును యుద్ధమునకుఁ దలపడిరి. అసాధారణ ప్రతిభాశాలియగు సైన్యాధిపతియని ఆంగ్లచరిత్రకారుల మన్నన వడసిన మహమ్మదు తాకీఖాను కాశిము తరపున నాయకత్వము వహించి యుండెను. జూలై, 19 వ తారీఖు సూర్యోదయావసరమున యుద్ధము ప్రారంభమాయెను. కొంత కాలము, ఆంగ్లహైందవసైన్యములు రెండును హోరాహోరి పోరాడుచుండుటచే, జయాపజయంబు లనుమానంబుగ నుండెను. కాని, క్రమముగా నాంగ్లసైన్యము చలింపనారంభించెను. అనుభవజ్ఞుఁ డగు తాకీఖానుఁ డావిషయమును వెంటనే గుర్తించి, శత్రుసేనావిచ్ఛేదన మొనరించి మహాజయము బడయుట కయ్యదే తరుణమని యెంచి, తన ప్రత్యేకాశ్వికదళముతో నాతఁడు శరవేగమున ముందుకుబోయెను. ఆ సమీపముననే కాశిముయొక్క సైన్యభాగ మింకొకటి యుండెను. స్వామి యన్నము దినుచుండినందులకు సార్థకముగా రణరంగంబున విజృంభించి శత్రుజన దుర్నిరీక్ష్యుఁడైన తాకీఖానునకు ఆ సైన్యాధిపతికూడ నా మహాసమయమునఁ దోడ్పడి యుండెనేని, ఆంగ్లేయులకు నపజయము ప్రాప్తించి

యుండెడిది. తోడనే సంగ్రామముకూడ ముగిసియుండెడిది. * ఆ సైన్యాధిపతి యటుల నాచరింపక, తాకీఖానుపైఁ దనకుఁ గల విరోధమాత్సర్యములను బాటించి, యుద్ధమహాముహూర్తమున మిన్నకుండి, స్వామిద్రోహివలె, దేశద్రోహివలె సంచరించెను. ఆంగ్లసైన్యాధిపతి ఆడమ్సుకూడ, తాకీఖానువలె సద్భుతమగు ధైర్యస్థైర్యములుగల మహావీరుఁడగుటచేఁ దన యవస్థ కడు ప్రమాదకరముగనుండినను, ఇంచుకేని చలింపక, సూటిగా గుఱిచూచి, మహాసంరంభముతో దూఁకుచుండిన శాత్రవులపై జాటునుండి తుపాకులు వదలెను. తోడనే, వీరాగ్రేసరుఁడగు తాకీఖాను, తన యనుచరులతోఁగూడ నేలఁ గూలెను. ఆంగ్లేయులు విజయులైరి. పిమ్మటవారు మూర్షదాబాదు నగరమును స్వాధీనపఱచుకొనిరి.

మీర్కాశి మింకను బలవంతుఁడై యుండెను. అతని పాశ్చాత్యసైన్యాధిపతులును, ఇతర మహమ్మదీయ సైన్యాధిపతులును జీవించియే యుండిరి. ఆతని ఫిరంగిదళముకూడ భద్రముగనే యుండెను. పాశ్చాత్యశిక్ష గఱచిన పటాలములును, వన్నెగాంచిన యాశ్వికదళములును ఇంక ననేకములుండెను. కావున, ఆగర్దివిప్రాంతమునఁ దన సైన్యవిభాగమునకు వాటిల్లిన భంగము నెఱింగినంతనే, సుమారు సాతిక వేల

* The irregular horsemen... ...who might have decided the victory and with it the war, in favour of Mir Kasim, took no part in the action and retired after it had beed decided."

Malleson.—p. 149.

సైన్యమును సముచితసన్నాహములతో కాశిము పంపినవాఁడాయెను. ఈసమయమునఁ దనకు విజయము ప్రాప్తించునని యాతఁడు విశ్వసించి యుండెను.

మూర్షిదాబాదు నగరమునకు సుమారు 40 మైళ్ళ దూరమున నుండిన 'గిరియా' ప్రాంతమున మీార్కాశిము సైన్యము విడిసియుండెను. పర్వతమయమై సహజముగ దృఢముగ నుండిన యా ప్రదేశమును మీార్కాశిము మఱింత బలపఱచెను. సైన్యసంరక్షణార్థ మాతఁడు రణఘుడలు త్రవ్వించి, తదితర సన్నాహములగూడ నొనరించెను. అట్టి సురక్షితప్రదేశమున నాతని సైన్యము చక్కని వ్యూహముఁ బన్నుకొని నిలిచియుండెను. 'సమ్రూ', 'మార్కార్' నామధేయులగు కాశిము పాశ్చాత్యసైన్యాధిపతులు తమ సేనావిభాగములతో మధ్యప్రదేశమున నిలిచియుండిరి. ప్రసిద్ధిగాంచిన యాశ్వికదళముతోడను, తగు కాల్బలముతోడను 'అసదుల్లాఖాను' దక్షిణభాగమున నుండెను. ఆ యాశ్వికదళమున కెడమవైపునఁ దుపాకివాండ్రును, వారికి వెనుకభాగమున సైన్యసమేతుఁడైన ఆలీఖానుఁడును నుండిరి.

ఆగష్టు, 2వ తారీఖున నాంగ్లేయులు కూడ యుద్ధసన్నద్ధులై యరుదెంచిరి. వారిసైన్యమునందు 1000 సోల్జరులును 4000 సిపాయిలును నుండిరి. మందుగుండు సామాను మొదలగు పరికరములు విరివిగ నుండెను. బహుసమర్థుఁడగు 'ఆడమ్సు' తత్సేనాధిపత్యము వహించియుండెను. శత్రుసేనా

వ్యూహమును లెస్సగఁ బరిశీలించి, ఆంగ్లసైన్యాధిపతికూడ తనుచితప్రయత్నము లొనరించుకొనెను. వారి కొకవైపున 'భగీరథి' యును, రెండవవైపున 'బాన్సలీ' యును ప్రవహించుచుండెను. ఈ రెండు ప్రవాహములు వారి వెనుక భాగముననే కలిసియుండెను. ఇట్లు ప్రవాహపరిరక్షితమగు ప్రదేశమాంగ్లేయులకు మిక్కిలి క్షేమకరమైనదే, కాని, అపజయము ప్రాప్తించునేని, శత్రువుల వాఁడికైదువుల కెరయగుటయో, లేక చుట్టిముట్టి ప్రవహించుచుండిన నదీప్రవాహములంబడి మరణించుటయో తప్ప గత్యంతర ముండదు. ఆంగ్లసైన్యాధిపతి క్లైవువలెనే యపారధైర్యస్థైర్యములు గలవాఁడనుటకు సందియములేదు. కాని, "బంగాళాదిదేశంబులను బాలించువారు, ఆంగ్లేయులా? మీరాక్కాశిమా?" యను తీవ్రసమస్యను పరిష్కరించు యుద్ధ మట్టి ప్రమాదకరమగు ప్రదేశమున నాచరింపఁ గడంగు సైన్యాధిపతికూడ మోటు సాహసము గల మానిసియనియే చెప్పవలయు.

ఆంగ్లసైన్యమధ్యభాగమున యూరపియను దళముండెను. హైందవసైనికులు వారికిరువైపుల నుండిరి. వారి సందున నచ్చటచట ఫిరంగు లమరియుండెను. ఒక్క సిపాయిదళముమాత్రము వెనుక నుంచఁబడెను. సైన్యమున కిరువైపుల నదులు ప్రవహించుచుండెనని పాఠకు లెఱింగియే యున్నారుగదా.

ఇరుపక్షములవారును సర్వసన్నాహము లొనరించుకొని యుండుటచే నిరువురును దమతమ ఫిరంగులు ప్రయోగించుచు,

యుద్ధమునకుఁ దలపడిరి. ఆ కోలాహలములో, నాంగ్ల కాల్బలము ముందుకు నడచెను. తోడనే, కాశిము పాశ్చాత్య సైన్యాధిపతుల సైన్యవిభాగములును, కంపెనీ యూరపియను దళమును నొండొరుల దాకెను. యుద్ధము ప్రారంభమగుట గాంచి, దక్షిణ పార్శ్వమున నుండిన అసదుల్లాఖాను తన ప్రసిద్ధాశ్విక దళముతో నటు దిరిగి, వాయువేగమున నతి సాహసముగ వైరిపై లంఘించెను. పిడుగువలెఁ బడిన వైరిని వారింపఁజాలకుండుటచే, నాంగ్లసైన్య వామభాగము తుత్తునియ లాయెను. అచ్చటి యాంగ్లసిపాయిలు ధైర్యముతో బోరాడిరి. కాని, కార్యము లేకపోయెను. ఖానుయొక్క సైనికుల కరవాలముచేఁ గొందఱు నఱకఁబడిరి. కొందఱు, సమీపముననుండిన 'బాస్సలీ' నదిలోనికిఁ దరుమఁబడిరి. తోడనే, సంభవించిన మహోపద్రవము గుర్తించి, వెనుకనిలిచి యుండిన సిపాయి పటాలమును వారి సాహాయ్యమునకై యాంగ్ల సైన్యాధిపతి పంపఁగడంగెను. కాని, ఈలోన, అసదుల్లాఖానువలెనే తానుగూడ పరాక్రమోజ్వలుండై వెలుంగవలయునని యూహించి, బదరుద్దీన్‌ఖాన్ యను నాయకుఁడు నిజాశ్వికసేనాముఖంబునఁ బాఁజ్ 'సవ్రూ' 'మారాక్రు' లతోఁ బోరాడుచుండిన ఆంగ్లసైన్యముపైఁ జిచ్చర పిడుగువలెఁ బడి, వారికి వెఱపు గొలిపి, రెండు ఫిరంగులను వశపఱచికొనెను. ఆ సమయముననే, ప్రసిద్ధసైన్యాధిపతియగు 'నజీరుఖాన్' కూడ హుంకరించి, వైరిపై శరవేగమున లంఘించెను. ఇట్లు దావా

నలమువలె నలుదెసలను కాఱుక్రమ్మిన విరోధి యూథముల ధాకకుఁ గంపెనీసైన్యములు నిలువఁజాలకుండెను. వారి వామ భాగము ముందుగనే తుత్తునియ లాయెను. మధ్యభాగమునకు గొప్ప యుపద్రవము సంభవింపనుండెను. అపాయసమయ మున వినియోగించుటకై దాచి యుంచిన సైన్యముకూడ వ్యయమై పోయెను. అట్టి మహాసమయమున విశేషసైన్య సమేతుఁడై నిలిచియుండిన అలీఖానుకూడ, తోడి సైన్యాధి పతులవలెనే, విజృంభించెనేని, ఆంగ్లేయులకు సంపూర్ణపరా భవము సంభవించుట తథ్యము: కాశిముయొక్క మహా ప్రయత్నము లన్నియు ఫలప్రదము లాయెడివి: ముందువెనుక లాలోచింపక, కడు ప్రమాదకరమగు ప్రదేశమున రణ మాచ రింప సాహసించిన కంపెనీ సైన్యాధిపతికిఁ దన యపరాధము దారుణముగఁ దెల్లమై యుండెడిది. కాని, అట్టి మహాసమయ మున, తదుచితముగ విజృంభించి, తనస్వామికి మహావిజ యము గూర్చుటకు మాఱుగ, నా ఖాను మందమతియై యతి మందముగ మెలంగెను. అట్టిసమయమున నాంగ్లసైన్యాధిపతి వ్యక్తపఱచిన ధైర్యస్థైర్యములు వర్ణనాతీతములు. తన సైన్య మునకుఁ బ్రాప్తింపనుండిన మహాసంకటమును గుర్తించి, డేగ వలె నలుదెసలఁ బరికించి పరికించి, ఆలీఖానుని బుద్ధిమాంద్యము గనిపెట్టి, ఆతనివలనఁ దనకెట్టి యుపద్రవము సంభవింపదని గ్రహించి, యచటి తనసైన్యమునందలి యర్ధభాగమును దీసు కొని, బిఱబిఱ పోయి, శత్రుజనపరివృతులై తహతహ లాడు

చుండిన యా సైన్యవిభాగమునకు సమయోచితముగఁ దోడ్ప డెను. ఇంతలో, తెగిపోయిన ఆంగ్లేయ వామభాగముకూడ సర్దుకొని, మఱల శ్రేణులు దీర్చుకొనెను. సాహాయ్య మరు దెంచుటచే, కంపెనీ యూరపియను దళము తెప్పిఱిల్లి, తొంటి ధైర్యము ధరించి, కోల్పోయిన పిరంగులను మఱల వశపఱచి కొనెను. ఇట్లుండ, యుద్ధము శీఘ్రముగా ముగించి మహావిజ యము నందవలయునని యెంచి, పరాక్రమవంతుఁడగు అస దుల్లాఖాను రయమున ముందుకుఁ బోఁగడంగెను. కాని, ఆలీఖాను కారణమున యుద్ధ మస్తమితిరుగుటచే నాతఁడు వెను కంజ వేయవలసినవాఁ డాయెను. అట్టిసమయముననే ఆంగ్ల సైన్యాధిపతి నిరీక్షించుచుండెను. అపజయమువలనఁ గలుగు మహోపద్రవము నెఱింగిన యా సైన్యాధిపతి, తనసైన్యము నంతటిని చలించిన వైరిపై నాక్షణము వదలెను. అంతవఱ కును బాగుగనే పోరాడుచుండిన మీర్కాశిము పాశ్చాత్య సైన్యాధిపతులు తమ ప్రాణములొడ్డి వెంటనే విజృంభించు టకు మాఱుగ నుపేక్షించిరి. ఇట్లు వీరును, అట్లు ఆలీఖానును ప్రవర్తించుటచే, నసదుల్లాఖాను, ప్రతాపవంతుడయ్యు, నాంగ్ల ఝరీప్రవాహమున కడ్డు నిలువనేరక రణరంగమునుండి తొలం గెను. ఆంగ్లేయుల కా తెఱంగున విజయము చేకూఱెను (2, ఆగష్టు, 1763).

గిరియా యుద్ధమునఁ దనకు సంపూర్ణవిజయ మలవడు నని మే కాశిము విశ్వసించియుండెను. ఐనను, జయాపజయ

ములు దైవాధీనములని యెఱింగి, 'ఉంద్వానలా' యను కొండ లోయలో మఱియొక సైన్యము నాతఁడు భద్రపఱచి యుంచెను. పాశ్చాత్యశిక్ష కఱచిన నాలుగువేల పటాల మొకటియు, ఇతర కాల్బలము అశ్వికదళము పిరంగిదళమును గలసి యెనిమిదివేల సంఖ్యగల పటాలములును నందుండెను. అనుభవజ్ఞులగు సైన్యాధిపతులుకూడ నందుండిరి. సహజముగా నా ప్రదేశము మిక్కిలి దృఢముగ నుండెను. అవసరమగు స్థలములందు రణఘుడలు తీయించి, అంబరచుంబితంబులగు ప్రాకారంబులను నిర్మించి, నూరు పిరంగుల నుచిత స్థలంబుల నిలిపి, యుద్దానిని శత్రుజన దుర్భేధ్యముగ నొనరించెను. ఆ దుర్గమునకు ముందుగా నలువదియడుగుల వెడల్పుగల గంభీర మగు నగడ్తగూడ దీయించెను. దాటుటకు వీలులేని యూబి ప్రదేశ మా యగడ్తను రక్షించుచుండెను. మఱియు, చొర రాని యాప్రదేశమున కొక వైపున గంగానదియు, రెండవ వైపున 'ఉంద్వా' యను ప్రవాహమును గూడ త్రవ్వని పరిఖలై, ప్రవహించుచుండెను. అట్లనేక తెఱంగులు ప్రకృతి చేతను, మానవునిచేతను భద్రపఱుపఁబడి యుండిన యాదుర్గ రాజము పరాధీనమగుట యసంభవమని న్యాయముగ భావించి, తన కుటుంబమును, ధనాగారమును మాత్రము 'రోటాస్' యను దుర్గమునునుంచి, మీర్కాశిము మాంఘ్యీరు దుర్గమున నిలిచియుండెను.

గిరియా యుద్ధమునఁ బలాయన మొనరించిన సైన్యములు కూడ 'ఉంద్వానలా' దుర్గమునకే యేతెంచెను. ఆ దుర్గమును ముట్టడించుటకై యరుదెంచు మహాసైన్యమును వారించుటకుఁ గొలఁదిమంది సైనికులు మాత్రమే చాలును. అంత బలవంతముగ నుండిన యా ధుర్గరాజమును రక్షింపఁగడంగిన మహాసైన్యమునందలి వారలెల్లరు స్వామిభక్తి పరాయణులై, ధైర్యవంతులై, స్థిరచిత్తులై, యప్రమత్తులై మెలంగి రేనిఁ ఆంగ్లేయు లా పొలిమేరఁ గాలిడుటకునైన నవకాశ ముండఁజాలదు.

గిరియా యుద్ధమున జయించిన యాంగ్లసైన్య మా మహాదుర్గమును శీఘ్రముగా సమీపించి, దానిని ముట్టడించుటకు వలయు సన్నాహముల నొనరించెను. కాని, వారి యవస్థ కడు ప్రమాదకరముగ నుండెను. భయంకరముగ వైరి దుర్గమును సాధించుటకు వారెట్టి ప్రయత్నము లొనరించినను, విఫలమగుచుండెను. ముందుగానుండిన ప్రదేశమంతయు నూబియగుటచేతను, ప్రాకారములపై నుండిన పిరంగుల నోరులు తెఱచికొని వీక్షించుచుండుట చేతను, సమీపించుటకు వీలులేకుండెను. కాశిముయొక్క దళము లప్పుడప్పు డాకస్మికముగాఁ బడి బాధించుచుండుటచే, నాంగ్లేయుల యవస్థ దుర్భరముగ నుండెను. అట్టి ప్రదేశమున దీర్ఘముగా నిలిచినను, నిలువఁజాలక వెన్నిచ్చినను, అపాయము తప్పక సంభవించును. కాని, దురదృష్టవశమున నొక్క వైపరీత్యము సంభ

వించుటచే, కాశిముయొక్క మహాప్రయత్నమంతయు భగ్న మాయెను.

కంపెని సైనికుఁడొకడు పాఱివచ్చి, కాశిము సైన్యము నందుఁ బ్రవేశించియుండెను. దుర్గమునందలి సైనికులెల్లరు స్వామిభక్తిపరాయణులై, కడు జాగరూకతతో దుర్గమును రక్షించుచుండ, ఈ నరాధముఁడు సెప్టెంబరు నాల్గవ తారీఖు నిశీథమునఁ దన యనుచరుల కండ్లుగప్పి, కంపెనీసైన్యము సమీపించి, అభేద్యమగు నాదుర్గమునఁ జొరఁబడు మార్గముఁ దాను జూపింతునని వారికిఁ దెలియఁబఱచెను. తోడనే యాంగ్లసైన్యాధిపతి పరమానందభరితుఁడై, వలయు సన్నాహము లొనరించి, ఒకసైన్యవిభాగము నాప్రముచ్చుతోఁ బంపి, ఇతర సేనావిభాగములను సముచితస్థలములందు సముచితముగా నిలిపియుంచెను.

ఒక్క నీచుని కారణమున నెట్టి మహోపద్రవము సంభవించును! ఆ పాపాత్ముఁ డట్టి ఘోర మొనరించునని యెఱుంగఁజాలని మీర్కాశిము సైనికు లేమఱియుండ, కంపెనీ సైనికులు భద్రముగాఁ బ్రవేశించిరి. వారినిఁ గాంచినంతనే జెండాడుటకు మాఱుగ, దుర్గరక్షకులు కలవరపడి యిటునటు దిరుగాడ నారంభించిరి. తోడనే, కంపెనీ యితర సైన్యవిభాగములు కూడ సాయుధముగఁ జొరఁబడెను. దుర్గస్థులఁ కలవ

రము వెంటనే సహస్రాధిక మాయెను. తోడనే, ఆ దుర్గరాజ మాంగ్లేయుల వశమాయెను. *

ఆంగ్లేయుల గుణదోషములను మీర్కాశి మొక్కఁడే చక్కఁగ గుర్తించి యుండెను. దురంతరమగు వారి ధనతృష్ణను, నిరంకుశ ప్రవర్తనమును గూడ నాతఁ డనుభవించి యుండెను. వారి వలన దేశీయ నృపాలురకు రానుండిన విపత్తుగూడ నాతఁడు చక్కఁగ గుర్తించియుండెను. సైన్యవ్యవస్థలయందు గూడ నత్యంతానుభవముగల వీరుఁడగుటచే, నతి భయంకర ముగఁ జెలరేగుచుండిన ఆంగ్లేయ మహాప్రవాహము నరి కట్టుట కాతఁడు చాలియుండెను. కాని, ఒక్కొక్కసమయ మున నొక్కొక్క తెఱంగునఁ బరిస్థితులు విషమించుచుండు టచే, నామహనీయుని ప్రయత్నము లన్నియు నిరర్థకము లాయెను. బంగాళాదేశ స్వాతంత్ర్యము నిలుపఁగడంగిన యమ్మహాశమాని, పైనుదహరించిన తెఱంగున, భగ్నమనో

* ఈ యుద్ధమున మీర్కాశిమునకుఁ గలిగిన నష్ట మత్యధికము, అనంతము. ఆ దుర్గమునుండి యవ్వలకేగుట కొక వారధియుండెను. దుర్గరక్షకు లప్రమత్తులై పోరాడవలయుననియు, త్వరపడి పలాయన మొనరింపరాదనియు నెంచి, మీర్కాశి మొక యేర్పాటు గావించెను. ఆ వంతెనపై బలమగు పటాలము నిల్పి, దుర్గము వీడఁగడఁగు సైనికులను గాల్పవలయునని యతఁడు కఠినముగ నాజ్ఞాపించెను. తదాజ్ఞాబద్ధులై యాసైనికు లట్టులే యొనరించిరి. ఒక వంక వైరులు, రెండవవంక మిత్రులు: తదుభయ దావానలమున కాహుతియై పదునైదువేల సైన్యము గ్రగ్గెను. మీర్కాశిము వెన్ను విఱిగిపోయెను. సమ్రూ, మార్కారుల సేనలు మాత్రము నిరపాయముగాఁ బలాయన మొనరింపఁగలిగెను.

రథుఁ డాయెను. తుదకాతఁడు తనదేశమున నిలువఁజాలక, అయోధ్య దేశాధిపతి నాశ్రయించెను.

అయోధ్యదేశాధీశుఁడగు సుజాఉద్దౌలా మీరాక్కాశిమున కాశ్రయ మొసఁగెను. బంగాళాదేశమునందలి యాంగ్ల కంపెనీ విజృంభణము గాంచి, దీర్ఘముగ విచారించి, కాశిమునకుఁ దోడ్పడుట కతఁడు సంసిద్ధుఁడాయెను. అయోధ్యాధిపతిని మఱపించియు, వెఱపించియు విడదీయవలయునని కంపెనీసేవకు లెంత ప్రయత్నించినను, ఆతఁడు చలింపలేదు. ఆ సమయమున నచటనే యుండిన ఢిల్లీశ్వరుఁడు కూడ సుజా ఉద్దౌలాతోఁబాటు యుద్ధసన్నద్ధుఁ డాయెను.

అట్లు వారందఱు నేకమగుటచే, నాంగ్లేయుల స్థితి కడు ప్రమాదకరముగ నుండెనని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. మఱియు, మీరాక్కాశిము బంగాళాదేశమున నిలుచుటకైన నవకాశ మొసంగక, ఆతనిఁ బాఱద్రోలిన మహాయోధుఁడు — 'ఆడమ్సు' మరణించెను. తదనంతరము సైన్యాధిపత్యము వహించిన వారలు దుర్బలులును, జడస్వభావులు నై యుండిరి. మఱియు, తన సైనికులు ప్రాణములపై నాసవదలి, ధైర్యముగఁ బోరాడి, తనకు మహావిజయము సముపార్జించుటచే, వారికి బహుమానముల నొసంగుదునని మీరాఫరు బాస చేసి యుండెను. కాని, కలకత్తాయందలి కంపెనీ సంఘసభ్యులు కేవల స్వార్థపరులై యుండుటచే, దాత సిద్ధముగా నుండి

నను, సైనికులకు ముట్టవలసిన బహుమానము లందలేదు.* ఆకారణమున నాసైనికులు విముఖులై, కుపితులై, తిరుగఁ బాటు సలుపనారంభించిరి. ప్రత్యేక సమర్థులును, విశేషసైన్య సమన్వితులును నగు మహమ్మదీయ మిత్రులు విజయలక్ష్మిని బడయుట కట్టి పరిస్థితులు మిక్కిలి యనుకూలముగ నుండెను.

కాని, మొగలాయీసార్వభౌముఁడు చాలా బలహీనుఁడు. అయోధ్యదేశాధిపతిపై నాతఁడు పూర్తిగ నాధారపడి యుండెను. సామ్రాజ్యపదభ్రష్టుఁడై యరుదెంచిన యీ పాదుషా ఆంగ్లేయుల సఖ్యము గూడ కోరుచుండెను. మఱియు, నతి శీఘ్రముగ నాంగ్లేయులవలన రానుండిన మహోపద్రవమును సుజాఉద్‌దౌలా—అయోధ్యదేశాధిపతికూడ సరిగ గుర్తించి నట్లు కానరాదు. ఆంగ్లేయుల నొకప్పుడు నిరసించుచు, మఱి యొకపుడు వారి నెయ్యమునే యాతఁ డపేక్షించుచుండెను. మఱియు, వైరులగు నాంగ్లేయులను శిక్షించి, శరణాగతుఁ డగు మీర్కాశిము నుద్ధరించుటకంటె తన రాజ్యమున కంటి యుండిన బీహారు దేశము నాక్రమించుటకే యాతఁడు రణ రంగము బ్రవేశించినట్లు కాన్పించును. ఐనను, వలయు సన్నాహములను సముచితముగా నొనరించుకొని, యాతఁడు యుద్ధ సన్నద్ధుఁ డాయెను.

* "Mir Jafar was ready enough to pay it, but his finances were under the virtual control of the Calcutta Council, and its members always ready to help themselves, closed their ears to the just demands of their soldiers," Malleson,—P 154.

ఈలోపున, ప్రసిద్ధిగాంచిన 'హెక్టరు మన్రో' యను నాతఁడు కంపెనీ పక్షమున సైన్యాధిపత్యము వహించెను. ఆతఁడు బహుసమర్థుఁడును, దయారహితుఁడగు శిక్షకుఁడును నగుటచే, సైన్యమున నుద్భవించిన తిరుగఁబాటును కఠినముగ నణచివైచి, వలయు విధంబున సంస్కరించి, యుద్ధసన్నద్ధుఁడై బయల్వెడలి, 1764 అక్టోబరు 22 వ తారీఖున, ప్రసిద్ధిగాంచిన 'బక్సారు' గ్రామము సమీపించెను. తోడనే, ఉచితమగు ప్రదేశమరసి, తన సైన్యవిభాగములను సరిగా సవరించుకొని, యప్రమత్తుఁడై యతఁడు విడిసియుండెను. వారి యెడమ వైపున గంగానదియు, వెనుక దెస బక్సారు గ్రామమును, అందలి దుర్గమును నుండెను.

సుజాఉద్దౌలాకూడ సర్వసన్నాహంబు లొనరించుకొని, బక్సారు సమీపించి, సురక్షితమగు ప్రదేశము నెదకి, యద్దానిని మఱింత బలపఱచి, శత్రుజన దుర్భేద్యంబుగ నొన రించి యట విడిసి యుండెను.

నలుబదివేల సైన్యమున కధినాథుఁడై, సాధింపవీలులేని ప్రదేశము నాక్రమించి, చక్కని వ్యూహము పన్ని విడిసి యుండిన అయోధ్యదేశాధిపతిని భంగపఱచుట యసాధ్య మని గుర్తించి, ఆంగ్లసైన్యాధిపతి యాలోచనాపరుఁడై, నిశా సమయమున వైరిపైఁ బడవలయునని నిశ్చయించుకొని యుండెను. కాని, అట్లు తటస్థము కాలేదు.

సూర్యోదయమైనంతనే, సుజాఉద్‌దౌలా సైన్యములు శ్రేణులు గట్టుకొని, ధరణి వడంకునట్లు బయల్వెడలి, ఆంగ్లేయ సైన్యమును సమీపించెను. అచటి భూమిని బరిశీలించి, యనుకూలమగు ప్రదేశమున జక్కని వ్యూహముఁ బన్నుకొని వారు యుద్ధాభిముఖులై యుండిరి. ఎడమవైపున గంగానది వఱకు వ్యాపించి, బక్సారు దుర్గము నాక్రమించియుండిన సైన్యవిభాగమునకు 'బెహ్నాబహాదూరు' అనువాఁడు అధినాథుఁడై యుండెను. ఆ సమీపముననే, కొంత కాల్బలము తోడను, చక్కని యాశ్వికదళముతోడను 'గులామ్‌ఖాదర్' అను సైన్యాధిపతి యుండెను. 'సమ్రూ', 'మాడక్' అను పాశ్చాత్యసైన్యాధిపతులు తమ మేటి పటాలములతోడను, ఎనిమిది పెద్ద ఫిరంగులతోడను మధ్యభాగమున నుండిరి. వారికి సాహాయ్యకరముగ, షూజా కూలీఖాన్ అను వాఁడు ఆఱువేల యాశ్వికపదాతులతోడ నుండెను. పాశ్చాత్య సైన్యాధిపతుల పటాలముల కిరువైపుల భయంకరములగు శతఘ్ను లమరి యుండెను. కాశీరాజు సైన్యము, రోహిల్లా సైన్యములు, ప్రసిద్ధిగాంచిన ఆఫ్ఘనుల యాశ్వికదళమును దక్షిణభాగమున నుండెను. కొంత యాశ్వికబలము ప్రత్యేకముగా వెనుకనుండెను. అట్టి వివిధ సన్నాహము లొనరించి, సర్వసైన్యాధిపత్యము తానే వహించి సుజాఉద్‌దౌలా దక్షిణభాగముననే యుండెను.

ఆంగ్లసైన్యమధ్యభాగమున నేడు సోల్జరు పటాలము లుండెను. వారి కిరువైపులను రెండు సిపాయి దళము లుండెను. ఆయా సేనావిభాగముల సందున పిరంగు లమరియుండెను. ఈ హైందవపాశ్చాత్యదళములకు రెండువైపులను గూడ దృఢమగు పిరంగులు భద్రపరుపఁబడి యుండెను. వారివెనుక, రెండవపంక్తి యేర్పడి యుండెను. మధ్యభాగమున నొక పాశ్చాత్యదళమును, దాని కిరువైపుల సిపాయిదళములును, వారి నడుమ పిరంగులును నమరియుండెను. ఆశ్వికదళము కూడ నచటనే యుండెను. అందు, మొదటి శ్రేణికిఁ బ్రాపుగా నొకభాగమును, వారి సామగ్రిని రక్షించుట కొకభాగమును సముచితముగా నమరియుండెను. వారి సైన్యమంతయు మొత్తముమీఁద నేడువేలకు పైగానుండెను. కంపెనీసైన్యము నందలి ప్రథమశ్రేణికి నెడమవైపునను, ముందుగను విశాల మగు నూబి ప్రదేశ ముండెను. ఆపై నొక గ్రామ ముండెను. కుడిభాగమునకు ముందుగా నొక విశాల మగు తోట యుండెను. ఆ గ్రామమునకును, తోఁటకును మధ్యగా నుండిన ప్రదేశమంతయు సమముగా నుండెను. ఆ తోఁటకు కుడివైపున మఱియొక గ్రామ ముండెను. ఆ గ్రామమును, ఆ తోఁటను గూడ సూజాఉద్దౌలాయొక్క సైన్య మాక్రమించుకొని యుండెను.

ఇట్లు, ఇరు తెఱంగులవారును సర్వసన్నాహము లొనరించు కొని, పరస్పర వినాశము దలపెట్టి, సమరోత్సాహులై, నిరీ

క్షించుచుండిరి. సైన్యాధిపతు లిర్వురు ననుభవజ్ఞులును, కార్య దీక్షా పరతంత్రులు నై యుండిరి. అపజయమువలనఁ గలుగు మహాసంకటమును గుర్తించిన వారలగుటచే, వార లిర్వురు జయింపవలయు ననియే కృతనిశ్చయులై యుండిరి.

సుమారు, తొమ్మిదిగంటలకు యుద్ధము ప్రారంభమాయెను. శత్రుసైన్యమును సూక్ష్మముగాఁ బరిశీలించి, తనసైన్యవిభాగ మును ముందుకు నడిపించి, రిపుసేనామధ్యమును గుఱిచూచి, తన పిరంగులను సుజాఉద్ దౌలా ప్రయోగించెను. అచటి యాంగ్లపిరంగు లంతదూరము బోఁజాలని కారణమున, వారు ప్రత్యుత్తర మొసంగనేరక పోయిరి. తోడనే, ఆంగ్లసైన్యాధి పతి యా సైన్య విభాగమును ముందుకుఁ ద్రోయగడంగెను. కాని, ఊబిప్రదేశము వారి కడ్డుగా నుండెగదా. శత్రు శతఘ్నులకు గుఱియై, ఆ యూబి ప్రదేశము చుట్టి ముందున కేగుట మిగుల కష్టముగ నుండినను, కృతకృత్యులై, వారు కూడ తమ ఫిరంగులను బ్రయోగించిరి. వా రట్లు పిరంగులను ప్రయోగించుచు, శ్రేణులు గట్టుకొని, ముందుకు సాగుచుండ నొక యపాయము సంభవించెను. శాత్రవులగు నాఘ్గను జాతులు పరుగుపరుగున పఱతెంచి, ఆంగ్ల వామభాగమును ఛేదింపఁగడంగి, భగ్నమనోరథులై, ఱివ్వునఁదిరిగి, ఆంగ్లే యుల సామగ్రిని రక్షించుచుండిన సైన్యముపై బడి చెండాడి, ఆ సామగ్రి పూర్తిగా వశపఱచి కొనిరి.

గులామ్‌ఖాదర్ యాశ్విక దళము కూడ నాఘనులకుఁ దోడ్పడియుండెను. అట్లు విజయులై నంతనే, వారు ద్విగుణీకృతోత్సాహముతో శరవేగమునఁ బోయి, ఆంగ్లేయుల వెనుక శ్రేణిపైని పిడుగులవలెఁ బడిరి. ఆంగ్లేయు లత్యంత పరాక్రమము బ్రదర్శించిరి. అమితోత్సాహులై యాశ్విక దళమును నడపించుచుండిన మహమ్మదీయ నాయకుఁడు నిహతుఁడాయెను. ఐనను, వారి యుత్సాహము తఱుగకుండెను.

శత్రుసంహార మొనరించుటకై, నబాబు — సుజాఉద్దౌలా కాల్బలముకూడా తీవ్రప్రయత్నము లొనరింపగడఁగెను. ఆంగ్ల శ్రేణి దక్షిణభాగమున కంటియుండిన గ్రామమునకు దృఢతమంబులగు పిరంగులను నబాబు నడిపించి, శత్రుసైన్యముపైఁ బ్రయోగించెను. తోడనే, అయ్యాంగ్లసైన్యము చలించెను. సహస్రనయనములతోఁ బరీక్షించుచుండిన ఆంగ్లసైన్యాధిపతి యా విషయము గాంచి, అందువలనఁ గలుగు నుపద్రవము గుర్తించి, ఆ గ్రామముపై నొక సిపాయిదళమును బంపెను. ఆ సిపాయిలు వేఱొక మార్గమున శరవేగమునఁ బోయి, కరవాలములు పూని, హఠాత్తుగ రిపుల లంఘించి, వారినిఁ గలవరపఱచి యా గ్రామమున నాక్రమించిరి. అచటి తోఁటను గూడ నాక్రమింపవలయునని యాసించి, ఆంగ్లసైన్యాధిపతి మఱియొక సిపాయిదళమును బంపెను. కాని, అంతలో, మహమ్మదీయులు సర్దుకొని, ధైర్యము వహించి, ఏతెంచిన వైరిని దాఁకి, పూర్తిగ భంగపఱచి పాఱదోలిరి.

వార లట్లు ధైర్యమువహించి, ఆతోఁటయందే నిలిచి యుందురేని, నబాబు జయించుట తథ్యము. ఆతని యాశ్విక దళ మాంగ్లేయుల రెండవశ్రేణిని జిందరవందర జేయుచుండెను. ఆతని పాశ్చాత్య సైన్యాధిపతులు మధ్యభాగమున హోరాహోరి పోరాడుచుండిరి. నబాబు నాక్రిందనుండిన దక్షిణభాగము, ఇంచుకేని చలింపక, ధైర్యముగాఁ బోరాడుచుండెను. అట్టి సమయమున, నాతోఁటలోనున్న సైన్యవిభాగముకూడ, సమీపింపనుండిన శత్రుసైన్యమును జేరనీయక సమాన ధైర్యముతో బోరాడునేని, నబాబునకు విజయము చేకూరుట నిక్కువము.

అనుభవజ్ఞుఁడగు నాంగ్లసైన్యాధిపతి యాతోఁట ప్రాముఖ్యము చక్కఁగ గుర్తించి యుండెను. తానాప్రదేశము నాక్రమించినకాని జయించుట యసంభవమని యాతఁడు గ్రహించెను. ఎట్టులైనను శత్రుసైన్యము నాప్రదేశమునుండి బాఱద్రోలినగాని, రణరంగమునఁ దాను నిలుచుట కల్లయని యాతఁ డెఱింగియుండెను. కావున, ఆవైపుననే తన దృష్టి నిల్పి, స్వీయసేనావిభాగము నంతయు నటు పంపెను. తోడనే, రెండుసైన్యములును యుద్ధమునకు డీకొనెను. యుద్ధ మతి తీవ్రముగ నతితీక్ష్ణముగ నతిదారుణముగఁ బరిణమించెను. హైందవస్వాతంత్ర్యము నిలుపఁగడంగిన అయోధ్యాధిపతికిని, హైందవ స్వాతంత్ర్యము హరించుచుండిన ఆంగ్లేయులకును జరుగుచుండిన సంగ్రామముయొక్క జయాపజయములు నిర్ణ

యించు మహాముహూర్త మేతెంచియుండెను. కాని హైందవ స్వాతంత్ర్యాంతము సమీపించుటచే, మహమ్మదీయులు వెనుకకు తగ్గిరి; ఆంగ్లేయు లాతోఁట నాక్రమించిరి.

ఆంగ్లేయుల యవస్థ కొంత సుకరముగ నుండినను జయాపజయము లింకను అనుమానముగనే యుండెను. తోఁటలో నుండి మఱలిన మహమ్మదీయసైన్యము వెంటనే శ్రేణులు గట్టుకొని, అచలాకృతి దాల్చెను. ఇంకను నబాబు జయించు నవకాశ ముండెను. కాని, ఆతని సైనికులు ప్రాణములపై నాస వదలి, ధైర్యోత్సాహములు వహించి, వైరితో హోరాహోరి పోరాడుచుండ, హఠాత్తుగ నొక గొప్పప్రమాదము సంభవించెను.

నబాబుయొక్క పాశ్చాత్య సైన్యాధిపతులకు కూలీఖానుడనువాఁడు ప్రాపుగానుండెగదా! ఆతోఁటలో జరుగుచుండిన సంకులసమరమును దూరమునుండియే గాంచి, దిక్కులు పిక్కటిల్లునట్లు గర్జించు ఫిరంగుల భూరిధ్వానంబుల నాలించి, యుక్తాయుక్తములను విచారింపక, తనవారలు జయించిరనియే నిశ్చయించి, వైరిని సంపూర్ణముగా భంగపఱచి మహావిజయము వడయుట కయ్యదే తరుణమని యెంచి, తన యభిప్రాయము నెవ్వరికి నెఱింగింపక, నిజసైన్యసమేతుఁడై యెదుట నుండిన యూబి ప్రదేశమును ఱివ్వునఁ జుట్టి, వైరిపై లంఘించి, అతి తీవ్రముగఁ బోరాడి, గోడవలెనుండిన యాంగ్ల సైన్యమును ఛేదింపఁజాలక యా ఖాను మరణించెను. ఆతఁ

డొనరించిన మహాపరాధ మాతని మరణముతో దీరునది కాదు. జయింపఁజాలిన సుజాఉద్దౌలా పరాజితుఁడగుటకుఁ గూడ నయ్యదే కారణభూతమాయెను.

అతి సాహస మొనరించిన కూలీఖానుఁ డట్లు మరణింపగనే, వాని సైన్యవిభాగమంతయు రయమున వెనుకకు మఱలి పోయెను. తోడనే, ఆంగ్లేయులు సింహనాదము లొనరించి, పగతుర వెన్నాడఁ దొడంగిరి.

కూలీఖాను కారణమున నట్టి ఘోరము సంభవించినను, వీరాగ్రేసరుఁడగు సుజాఉద్దౌలా చలింపలేదు. చెదరిన శ్రేణుల నాతఁడు సరిజేసికొని, మఱల వైరినిఁదాఁకవలయుననియెంచి తీవ్రతరప్రయత్నము లొనరింపఁగడంగెను. ఝురీవేగమున నరుదెంచుచుండిన వైరుల పరాభవించుట యసంభవమైనను, వారిని వారించి, యుద్ధరంగమునుండి క్షేమముగా మఱలుటకు నైన నవకాశ ముండెను. అట్టి సమయమున, పిడుగు వంటి ప్రమాదము వేఱొకటి దాపరించెను.

'బెహసీబహదూరు' అను సైన్యాధిపతి బక్సారు గ్రామమును, అందలి దుర్గమును నాక్రమించి యుండెను. ఆతఁడు దూరమున నుండుటచే, యుద్ధరంగమున నేమిజరుగుచుండెనో స్పష్టముగ దెలియకుండెను. కూలిఖానుని తీవరపాటుచే నబాబునకు సంభవించిన యుపద్రవము గూడ నాతఁ డెఱుంగఁ జాలకపోయెను. ఎఱుంగనివాఁడు అప్రమత్తుఁడై యుండక నబాబు విజయము గాంచె ననియే దృఢముగ విశ్వసించి,

గర్వించి, నిర్విచారముగ నేమరియుండెను. ఆతని సైనికులు కూడ శ్రేణులు వీడి, యిటునటు దిరుగుచు, రానుండిన మహోపద్రవము నెఱుంగని మూఢాత్ములై హాయిగ నుండ, నాంగ్లసైన్యము హఠాత్తుగ గోచరించెను. తోడనే, యా సైనికులు భయవిహ్వలులై పలాయన మొనరించిరి. యుద్ధరంగమునం దంతటను హాహాకారములు జనించెను. అంత వఱకును ధైర్యముగా నిలిచియుండిన నబాబుకూడ రయమునం దొలంగవలసినవాఁ డాయెను.

అయోధ్యాధిపతియగు వజీరునకుఁ గలిగిన నష్ట మత్యధికము. రణరంగమున రెండువేలసైన్యము మడసెను. విజయోత్సాహులగు పగతురకు వెఱచి, నౌకావినిర్మితసేతువుపై గొంతసేనతోడ వడివడి పాఱి యవ్వలిదరి జేరినంతనే, భయాతురంబున నా వారధి నాతఁడు నాశనము చేయించెను. విశేషసైన్య మింకను బక్సారువంక నుండిపోయెను. మృత్యువువలె వెనుదఱుము వైరిని వారింపఁజాలక, పాఱిపోవుటకు వంతెనగానక, తదవసర విపరీతభయావేశమున నయోధ్యాధీశుని సైనికులేగాక గజాస్వాది జంతుజాలములుగూడ నీటఁ బడి యసంఖ్యాకముగ మరణించెను. అట్టి మృతకళేబరములు మూడువందల గజముల పొడవున వంతెనగా నేర్పడ, తక్కుంగల అయోధ్యసైనికులు తన్మార్గమునఁ బలాయన మొనరింపఁజాలిరి. ఆంగ్లేయులకు నూటముప్పదిమూడు ఫిరంగులుదొరకెను. వైరిశిబిరము పూర్తిగ వారి యధీనమాయెను. ఇట్లు, ఆంగ్లేయులకు మహావిజయమును, వజీరునకు మహాపజయమును ప్రాప్తించెను.

బక్సారుయుద్ధము జరిగిన మఱుచటి యుదయముననే, ఢిల్లీ సార్వభౌముఁ డాంగ్లేయుల నెయ్య మపేక్షించి వారి పంచజేరెను. తోడనే, అయోధ్యదేశాధిపతియగు సుజాఉద్దౌలా కూడా నాంగ్లేయులతో సంధి గావించుకొనవలయునని ప్రయత్నించెను.

యుద్ధము ముగిసిన యుత్తరక్షణము నుండియు, నాంగ్లేయులు ధనముకొఱకు మీర్జాఫరును బాధింపఁదొడంగిరి. అతి సారవంతము లగు బర్ద్వాను, మిడ్నాపూరు, చిట్టగాంగు జిల్లాలను కంపెనీ కొనంగి, పైగా వారికి నెలవక్కింటికి దైదు లక్షుల పైకముగూడ సమర్పింపవలసినవాఁ డగుటచే నబాబునకు సగము రాఁబడి నష్టమాయెను. మిగిలిన సగముపైకము మాత్ర మాతనికి దక్కియుండెనా? బహుమానములని కొల్లగాను నాంగ్లకంపెనీ సేవకులు కోరునంతనే ధనము చెల్లింపవలసిన షరాబువలె మీర్జాఫ రుండెనని క్లైవు వర్ణించియున్నాఁడు.* ఆంగ్లకంపెనీసేవకుల సొంతవ్యాపారముచే నబాబుయొక్క ఆర్థికస్థితి నికృష్టమాయెను. కంపెనీసేవకుల దుష్ప్రవర్తనముచే దేశీయ పరిశ్రమలన్నియు నసింప నారం

* Cf.—"By the revenues of the three ceded districts, added to the monthly payment, for the war, "the Company" we are informed by Cilve, "became possessad of one half of the Nabob's revenues. He was allowed, says that great informant, "to collect the other half for himself; but in fact he was no more than a banker for the Company's servants, who could draw upon him" (meaning for presents) "as often, and to as great an amount as they pleased......The importunities to which he was subjected only conspired, with the infirmities of age and of a body worn out with pleasure, to hurry him to his grave."

Mill. Vol. III—P. 358.

భించెను. వయోవృద్ధుఁడై, దుర్బలుఁడై యుండిన మీర్జాఫరు ఆంగ్లకంపెనీసేవకుల పీడనము భరింపఁజాలక, శీఘ్రతరముగ మరణించెను (జనవరి 1765).

ఆతఁడు మరణించినను, ఆతని జీవిత వృత్తాంతము మాత్ర మాంగ్లేయులు హిందూదేశమును జయించిన యద్భుతవిష యమును వ్యక్తీకరించు గుణపాఠమువలె శాశ్వతముగ జరిత్ర యందు నిలిచియుండును.

మీర్జాఫరు మరణించినంతనే, మఱియొకని నా సింహాసన ముపై నిలుపుట యవసర మాయెను. రూపు రేఖావిలాస ములు లేని యొక శిలాభాగమున కేదియో పవిత్రనామ మొసంగి, యాడంబరముగాఁ బ్రతిష్ఠించి, అల్పజ్ఞులగు జను లను మోసగించి, ధనార్జన మొనరించు టక్కరి పూజారుల వలె నాంగ్లసేవకులు మెలఁగుచుండిన కారణమున, 'నబాబు' ఒకఁడు వారికిఁ గావలసి వచ్చెను. బంగాళా బీహారు ఒరిస్సా దేశముల రాజ్యాధిపత్యమును వారు బహిరంగముగ వహించి నను వారి నధిక్షేపించువారు లేరు. అట్లుగాక, విగ్రహము నొండు సింహాసనముపై నిలిపి, నిక్కంపు రాజ్యాధికారమును చేఁజిక్కించుకొని, నిరంకుశముగ మఱికొంతకాలము ధనార్జన మొనరింపవలయుననియే వారు యోచించిరి.*

* Cf.—"But the modesty of the English, still alarmed at the thought of declaring themselves sovereigns of Bengal, grasped powerfully at the reality, though it desired to shun the appearance of power," Mill, Vol. III, p. 55d.

నబాబును తయారు చేయుటకంటె లాభకరమగు విషయము కంపెనీసేవకులకు వేఱొకటి లేదు. కాని రాజ్యాధిపతిని నిర్ణయించుటలో వారు గమనింపవలసిన ముఖ్యాంశములు రెండుండెను. రాజ్యాధిపతి యగునంతనే యాతఁడాంగ్లకంపెనీ సేవకులపై ధనవృష్టి గురియింపవలయును. తమకెట్టి యడ్డంకియుఁ గలిగింపక నబాబు జీవచ్ఛవంబువలె నుండవలయును. వారి దృక్పథమున నట్టివాఁడే రాజ్యార్హుఁడు. కాఁబట్టి, కంపెనీ సేవకులు దీర్ఘముగ విచారించి, మీరాన్ కుమారుని విసరించి,* ఆతనిసోదరుఁడగు నజీముద్దౌలాను రాజ్యాధిపతి నొనరించిరి. ఆత డపు డిరువదియేండ్ల ప్రాయఁపు వాఁడై యుండెను. ఆతనితో నాంగ్లేయు లెట్టి సంధి గావించి యుండిరో అరయుదము. ఆతని తండ్రియగు మీర్జాఫరు కావించియుండిన తొంటి యొడంబడిక మొదట ఖాయపఱుపఁబడెను. పై రాష్ట్రాధిపతుల వలన భయము లేకుండ దేశమును సంరక్షించు భారమంతయు దామే పూర్తిగ వహింతుమని ఆంగ్లేయులు తెలియఁబఱచిరి. రాజునకుగల గౌరవము నిలిపికొనుటకును, న్యాయప్రదానమునకును, శిస్తులు వగైరాలను వసూలు చేయుటకును వలయు స్వల్పసైన్యమును మాత్రమే నబాబు కలిగియుండవలయునని వారు శాసించిరి.

*మీరాన్ కుమారుఁడు డాఱేండ్ల బాలుఁడు. వానికి రాజ్య మొసఁగినచో పరిపాలనా భారమంతయు కంపెనీ వహింపవలయును: అంతటి బాధ్యత వహించుట కష్టము: మఱియు కంపెనీ సంఘసభ్యులకు బహుమానములు దక్కవు.

ఆ కారణమున దమ కగు నధికవ్యయమును నబాబే భరింప వలసినవాఁ డాయెను. సైన్యమంతయు నాంగ్లేయుల యధీన మున నుండుటచే నతఁడు పూర్తిగ నాంగ్లేయులపై నాధార పడియుండవలయును.

వా రెట్లు ప్రవర్తించినను, నాతని నెట్లు బాధించినను, నబాబు ప్రతీకార మొనరించుట కెట్టి యవకాశము నుండదు. సైనికాధికారమే కాక, 'సివిల్' పరిపాలనము గూడ వారు వశపఱచికొనిరి. తాము సిఫార్సుచేయు వానిని దివానుగా నబాబు పరిగ్రహింపవలయుననియు, అట్టి దివానునకుఁ దన రాజ్యాధికారము నంతయు నప్పగింపవలయుననియు, అట్లు సర్వాధికారము వహించు దివానును తమ యనుమతి లేకుండ నబాబు తొలగింపరాదనియు గూడ నాంగ్లేయులు శాసించిరి. ఇంతకంటె విషమమగు షరతు వేఱొకటియుండదు. అన్ని షరతులకంటె నవాబున కియ్యదే మిక్కిలి బాధకరమైన దని చరిత్రకారుఁడగు 'మిల్లు' వ్రాసియున్నాఁడు.*

ఈ షరతులనుబట్టి నబాబుస్థితి యెట్లుండునో పరిశీలింతము. మొదటనే, సగమురాజ్య మూడిపోయెను. మిక్కిలి కష్టము మీఁద వసూలగు ధనము ఆంగ్లేయులకు సమర్పించుటకే చాలకుండెను. సైనికాధికారమంతయు నాతఁడు కోల్పోవు టచే నాతఁడు పూర్తిగ నాంగ్లేయులపై నాధారపడియుండ వలెను. తుదకు, 'సివిల్' యధికారముగూడ నాంగ్లేయుల

* R. Mill, Vol. III, p. 359.

కిష్టుఁడగు దివానున కప్పగింపవలసినవాఁ డగుటచే, నట్టి నబాబునకును, ఒక మట్టివిగ్రహమునకును, నెట్టిభేదమైనను నుండదని స్పష్టమగును.

బంగాళా దేశమును నిరంకుశముగాఁ బరిపాలింపవలసిన నబాబు లీతెఱంగున సంపూర్ణముగాఁ స్వాతంత్ర్యవిరహితులై పోయిరి.

---

## 'దివానీ'

ఆంగ్లకంపెనీసేవకుల ప్రవర్తనము హైందవుల కెట్లు దుర్భరముగ నుండెనో, ఎంత దుస్సహముగ నుండెనో పాఠకులు గ్రహించియున్నారు. హిందూదేశస్థులకే గాక, ఇంగ్లాండు దేశస్థులకు సహితము తమ సేవకుల ప్రవర్తనము కడుంగడు దుర్భరమాయెను. కారణములు మాత్రము వేఱుగ నుండెను. అయ్యవి గమనింపఁదగియున్నవి.

ప్లాసీయుద్ధము జరిగినది మొదలు, ఇంగ్లాండునందలి యాంగ్లసంఘమునందు నద్భుతమగు క్రొత్తసంచలన ముదయించెను. క్లైవైనను వెలలేని జనులు హిందూదేశమునఁ గొలదికాలముండి, లక్షాధికారులై, ఇంగ్లాండు దేశమునకుఁ బోవుచుండిరి. అట్టివారి రాక మొదట సంభ్రమమునకును,

పిదప విస్మయమునకును తుదకు మత్సరమునకును గారణమాయెను. తోడనే, ఇంగ్లాండుదేశస్థుల ధనతృష్ణతీక్ష్ణముగ విజృంభించెను. తాము ధనికులమగు మార్గమును క్లైవు కనిపెట్టెనని యెంచి, వారాతని నభినందింపదొడంగిరి. ఆయాసపడు నవసరములేక, ధనరాసులను వడయు మార్గము గోచరమాయెనని వారెంతయు సంతసించిరి. ఒక్కసారి హిందూదేశమున కేగినచో దారిద్ర్య విచ్ఛిన్నమగుననియు, తాము శాశ్వతముగ భోగభాగ్యసమన్వితులై యుండనగుననియు భావించి వా రానందపరవశులైరి. ఆంగ్లేయులు ధనాశాపరవశులై హిందూదేశమునకుఁ బోవలయునని తత్తరపడసాగిరి. పరపతిచెడి దివాలా తీయువారును, నతి సాహసికులగు సైనికులును, లాభకరమగు జీవనోపాధి దొఱకదని వెఱచు సద్వంశజులగు 'నగస్త్యభ్రాతలు'ను తమ కేదైన నుద్యోగము నొసంగి పంపుడు” అని అచటి కంపెనీ సంఘాధికారులను బ్రార్థింపఁ గడంగిరి. తుదకు, ప్రాచ్యదేశ ధనార్జన మొకయంటురోగమువలె నింగ్లాండుదేశమునందు వ్యాపించెను.*

నిఱుపేదలగు జనులు హిందూదేశమునుండి కుబేరులై ఇంగ్లాండుదేశమున కేతెంచుచుండిరి. వారి ధనము కష్టార్జితముకాకుండుటచే, విరివిగ వెచ్చించుచు, మహావైభవముతో వారు కాలము గడుప నారంభించిరి. వారి యైశ్వర్యమును గాంచి మత్సరపడువారును, వారి యాడంబరముగాంచి

* Cf. Torren's "Empire in Asia" p. 52.

యసహ్యపడువారును గూడ నయ్యాంగ్లకంపెనీ సేవకులను “నబాబు” లని పరిహసింపదొడంగిరి.

హిందూదేశమునుండి ధనవంతులై స్వదేశమునకుఁ జేరు వారిలోఁ గొందఱెంత ద్రవ్యమైనను వెచ్చించి, ‘పార్లమెంటు’ లోఁ జొరబడుచుండిరి. కొందఱు కంపెనీ “షేరులు” గొనుచుండిరి. మొత్తముమీఁద నెద్దియో తెఱంగునఁ దమయన్యాయార్జిత విత్తమును బ్రదర్శింపుచు నాంగ్లకంపెనీ సేవకులాంగ్లప్రజాదృష్టి నాకర్షించుచుండిరి.

ఐనను, ఆంగ్లకంపెనీ సంఘాధికారులాయా యత్యాచారములను సరకుఁజేయువారుకారు.* కాని, హైందవజనులను హింసించి, ధనసంగ్రహమొనరింపఁ గడంగిన కంపెనీసేవకులు కేవల స్వార్థపరులై యుండిరి. మానవునకు సహజగుణములగు దయాదాక్షిణ్యములను ధనాశాపారవశ్యమున మఱచిపోయినట్టులే, కంపెనీ లాభక్షేమములను గూడ వారు మఱచిపోయిరి. తమకు రావలసిన లాభములు సరిగా ముట్టకుండుటచే కంపెనీ ‘డైరక్టరులు’ ను, ‘ప్రొప్రయిటరు’ లును ఆగ్రహపరవశులైరి. అపుడు, తమసేవకులయొక్క అత్యాచారములును, దుర్వ్యాపారములును, క్రూరప్రవర్తనమును వారికి గోచరము కాఁజొచ్చెను. సొంతవ్యాపారమొనరించి కుబేరులు కాఁగోరిన తమ కంపెనీసేవకులు ప్రదర్శించిన క్రౌర్యమునకు ఏ యుగ

* Cf. "They took no heed of the enormous perqluisites often amassed by individual officials, so long as there was no public scandal", V. A. Smith. p. 502.

మునందైనను ఏ దేశమునందైనను సాటియుండదని కంపెనీ డైరక్టర్లు అప్పుడు గుర్తించిరి.† అట్టి సొంతవ్యాపారమునేగాక, బహుమానములను నెపమున నబాబులను పీడించి ధనార్జన మొనరించు దురాచారమును గూడ కంపెనీసేవకులు పూర్తిగ మానివేయవలయునని డైరెక్టర్లు అప్పుడు శాసించిరి. బంగాళాదేశమున శాంతి నెలకొల్పుట ప్రధానకర్తవ్యమని వారికప్పుడు వ్యక్తమాయెను. బంగాళాదేశమున నిరంకుశవిహార మొనరించుచుండిన తమ సేవకులను గఠినముగ దండించినగాని దమ దుర్నయములను మానరనియు, వారి దుష్ప్రవర్తనము తుదముట్టినగాని దేశమున శాంతియు, ప్రభుత్వమును నెలకొన వనియును, అటులైనగాని, తమ లాభములు సరిగా రావనియును, ఇంగ్లాండునందలి కంపెనీ సంఘాధికారులు గ్రహించిరి.

అంతటి మహాత్కార్యభారము వహింపఁజాలిన నాయకునికై వారు ప్రయత్నించిరి. కాని, ఆయుగమున క్లైవుకంటె సమర్థుఁడగు నాయకుఁడెవఁడు? దక్షిణ హిందూదేశమున ఫ్రెంచివారు మహారాజ్యనిర్మాతలై, మహావైభవసమన్వితులై విరాజిల్లుచుండ, నాంగ్లేయులు నిలుచుటకు నీడయైనను లేక తహతహలాడుచుండిన సమయమున, వారిని క్లైవే యుద్ధరించెను. సురాజద్దౌలాకు వెఱచి, తమ సర్వస్వమును విడిచి,

† Cf. "......We think the vast fortunes acquired in the inland trade have been obtained by a scene of the most tyrannic and oppressive conduct that ever was known in any age or county."
quoted by Mill—Vol. III, p. 390.

పంద్రలై పాఱియుండిన ఆంగ్లేయులను క్లైవే యుద్ధరించెను. నబాబును దవ్వున గాంచునంతనే వంగివంగి జోహారు లొన రించు నాంగ్లేయులను క్లైవే గర్వాధికారబలసమన్వితుల నొన రించెను. సకలజనభయంకరముగ శాసించు నబాబులను క్లైవే జీవచ్ఛవంబుల నొనరించెను. ఇంగ్లాండుదేశస్థు లనాయాస ముగ ధనవంతులగు మర్మమునుగూడ క్లైవే కనిపెట్టి యుండెను. అట్టి క్లైవుప్రభువు తప్ప మఱియెవ్వరు బంగాళాదేశ మున శాంతి బ్రతిష్ఠింపఁగలరు? కాఁబట్టి, కంపెనీ సంఘాధి కారులచే నాతఁడు ప్రార్థితుండై, 1764 జూను మాసమున నింగ్లాండువీడి 1765 మే నెలలో కలకత్తానగరముఁ జేరెను.

కార్యశూరుఁడగు క్లైవు అధికారము వహించినంతనే కంపెనీ సేవకుల దురాచారముల నడంచుటకు వలయు తీవ్ర ప్రయత్నము లొనరించెను. అమాయికులగు హైందవులను పీడించి ధనార్జన మొనరించు నాంగ్లసేవకులు సులభముగ లోఁబడువారుకారు. కాని, క్లైవు సమర్థుఁడును, కార్యైక తత్పరుఁడును నగుటచే, నాతఁడు వలయు కాఠిన్యము వహించి, వారిని లోఁబఱచికొనఁగలిగెను. అనంతర మాతఁడు సైనికో ద్యోగులను గూడ లోఁబఱచికొనెను. అయ్యది మిక్కిలి కష్ట ముగ నుండెను. ఆసందర్భమున నాతఁడు వ్యక్తపఱచిన కార్య దక్షతయు, కార్యైకతత్పరతయు, ధైర్యస్థైర్యములును వర్ణనా తీతములు.

బంగాళా దేశస్థులకుఁ బ్రాణసంకటమై, తమ కెంతయు నష్టకరమై యుండిన కంపెనీసేవకుల సొంతవ్యాపారమును నిలిపి వేయవలయునని కంపెనీ డైరక్టర్లు ఆజ్ఞాపించియుండిరి. క్లైవు కొన్ని సంస్కరణములు ప్రవేశపెట్టి, శాంతి నెలకొల్పఁ గడంగెను. కాని, మిక్కిలి లాభకరముగ నుండిన సొంతవ్యాపారమును మాత్ర మాతఁడు నిర్మూలింపలేదు. ఎవనికిఁ దోఁచు నట్లు వాఁడు విచ్చలవిడిగ దోపిడిచేయు దురాచారమును మాత్ర మాతఁడు మాన్పెను. అట్లు సంస్కరించి, కంపెనీ సేవకులను సంఘోపసంఘములుగ విభజించి, శాసనసమ్మతముగ నాతఁడు వారిచే వ్యాపారము చేయింపదొడంగెను.* తన తోడి సేవకులు లాభములు గడుచునపుడు తా నన్యథా ప్రవర్తించుట ధర్మముకాదని యెంచి, క్లైవుకూడ నందుఁ జొల్గొనెను. లాభమంతయు ముప్పదియైదు వాటాలుగ విభజింపఁబడెను. వారివారి తాహతుల ననుసరించి, కంపెనీసేవకు

---

* కంపెనీడైరక్టర్ల ఆజ్ఞను గుఱించి తన యనుచరులతో క్లైవు విచారించెను. లాభకరముగ నుండు వ్యాపారములను మాత్రము విసర్జింపరాదనియు; తమ యజమానుల యాజ్ఞను మన్నించుటకొఱకు లాభములేని వ్యాపారములను విసర్జింపవలయు ననియును వారు నిశ్చయించిరి. (a) లాభము నంతయు దామే తినినచో, కంపెనీయధికారులు సహింపరని యెంచి తమ లాభములో సాలుకు సుమారు 10,00,000 రూపాయలు కంపెనీకి చెల్లింప వలయునని వారు తీర్మానించుకొనిరి. †

(a) "And it was resolved that all the branches of the trade, which it was worth while to carry on, should still be steadfastly retained; but that proper respect should be shown to the commands of their masters; and what was of no value to keep should be immediately and completely resigned. Mill, Vol. III—p. 410. † p. 413.

లందఱు పంచుకొనిరి. అందు, క్లైవున కైదువాటాలు ప్రత్యేకింపఁబడెను. ఈ వ్యాపారమువలన నాతని కెంత లాభము లభించియుండెనో తెలియదుగాని, 1767 లో తన వాటాల నాతఁడు సుమారు మూఁడులక్షల రూపాయలకు విక్రయింప గలిగెను.*

ఆంగ్లేయులు బంగాళా దేశమును జయించిన కథ పూర్తి కావచ్చినది. ప్లాసీయుద్ధ కారణముగ ప్రారంభమైన ఈవిషాదోపాఖ్యానము బక్సారుయుద్ధముతోఁ బరిపూర్తియైనది.† దుర్బలుఁడగు మొగలాయీపాదుషాను పీడించి, బంగాళా బీహారు ఒరిస్సా దేశముల 'దివానీ' పదవిని బరిగ్రహించి క్లైవు ప్రభువు ప్రసిద్ధ పూరుషుఁ డాయెను.

పాదుషాయును, అయోధ్య దేశాధిపతియును బక్సారు యుద్ధమున నోటువడి ఆంగ్లేయులతో సంధి గావించికొననుండిరిగదా. కాని, యుద్ధము ముగిసినతోడనే, మీర్జాఫరును బీడించి ధనరాసులను రాఁబట్టు కార్యమున కంపెనీసేనకులు నిమగ్నులైరి. అచిరకాలమున వృద్ధుఁడును రోగపీడితుఁడును

* R. V. A. Smith, p. 502.

† Cf. —"The victory," i. e. at Buxar, "which was absolutely decisive, completed the work of Plassey."

"The battle of Buxar in 1764 had clsoed the story of military conquest of Bengal and Bihar, which from that date were substantially British territory, however the fact might be obscured by confused legal fictions concerning the Padshah of Delhi, the Subadar of Bengal and other personages whose real position differed widely from that officially ascribed to them."

V. A. Smith, p. 501.

నగు మీర్జాఫరు మరణించెను. తోడనే, నబాబును బ్రతిష్ఠించు మిక్కిలి లాభకరమగు మహాసమయము కంపెనీసేవకులకు దొరకెను. కాని, బహుమానముల నెపమున నబాబులను పీడించి ధనార్జన మొనరించు దురాచారమును విసర్జింపవలయునని కంపెనీ డైరక్టర్లు తత్పూర్వమే కఠినముగ శాసించియుండిరి. కాని వారియాజ్ఞను మన్నింతురేని, కంపెనీ సేవకులకు గొప్ప యాశాభంగము కలుగును. కాఁబట్టి, డైరక్టర్ల శాసనముల నుల్లంఘించి, తాము ప్రతిష్ఠించిన నబాబు నజీముద్దౌలా వద్ద యథోచితముగా బహుమానములు వడసి, 1765 ఫిబ్రవరి మాసమున నాతనితోఁ గావించిన యొడంబడికను వెనుకటి ప్రకరణమునఁ గాంచి యుంటిమి.

ఆంగ్లసంఘసభ్యు లట్టి మహత్కార్యములతో నిమగ్నులై యుండుటచే, నయోధ్యదేశాధిపతియగు వజీరు మఱల యుద్ధసన్నద్ధుఁడగుటకు నవకాశము కలిగెను. నిజముగ సమయమాతని కనుకూలముగనే యుండెను. కాని, హైందవ ప్రముఖులు కొందఱాంగ్లేయులకుఁ దోడ్పడుటచేతను, వారు సహజముగ బలవంతులును, నిపుణులును అగుటచేతను రంగములందెల్లడల నాంగ్లేయులే జయించుటచే, సంధికై వజీరు తత్తరపడెను. ఆసమయమునకే క్లైవుప్రభు వరుదెంచెను.

ఓటువడిన అయోధ్యాధిపతి అలహాబాదు కోరా జిల్లాలను గోల్పోయెను. ఆతఁడు యుద్ధపు ఖర్చులక్రింద నాంగ్లేయులకేఁబదిలక్షల రూపాయలను సమర్పింపవలసినవాఁడాయెను.

వజీరుతోడి వ్యవహారమా తెఱంగునఁ దీఱినపిమ్మట, తన దృష్టి ఢిల్లీసార్వభౌమునిపై క్లైవు కేంద్రీకరించెను. అతఁడు సార్వభౌముఁడైన కారణమున, బంగాళాదేశపు నబాబు లాతనికి కప్పము చెల్లించుచుండిరి. కాని, కడపటి నబాబును ఆంగ్లేయులు పూర్తిగ నధికారవిరహితు నొనరించుటచే, కప్పము జెల్లించుటకు వారలే బాధ్యులైరి. ఆవిషయమున ముప్పది లక్షలరూపాయలు సార్వభౌమునకుఁ జెల్లవలసి యుండెను. ఆంగ్లేయు లాపైకమును బూర్తిగ నెగవేసిరి. బంగాళాదేశపుఁ గప్పముతోఁబాటు ఐదున్నర లక్షల సంవత్సరాదాయము గల జాగీరులను గూడ సార్వభౌముఁడు కలిగియుండెను. కాని, అతఁడు పరాజితుఁడైన కారణమున నా జాగీరులను గూడ గోల్పోయెను.

ఈ సందర్భమున జరిగిన ముఖ్యాంశ మొకటి యున్నది. దుర్బలుఁడును, దురదృష్టవంతుఁడును అగు సార్వభౌముఁడు బంగాళా బీహారు ఒరిస్సా దేశముల ‘దివానీ’ పదవినిగూడ నాంగ్లేయులకు సమర్పింపవలసినవాఁ డాయెను. (12 ఆగష్టు 1765) అట్టి మహాత్యాగ మొనరించిన సార్వభౌమునకు అయోధ్యాధిపతిని నిర్బంధించి సంగ్రహించిన అలహాబాదు కోరా జిల్లాలను క్లైవొసంగెను.

‘దివానీ’ యనగా ‘రివిన్యూ’ వసూలు చేయు నధికారము. ఆంగ్లేయచరిత్రకారు లేలకో యీ ‘దివానీ’ యధికార కైంకర్య మొక మహావిషయమువలె నభివర్ణింతురు.

ఆంగ్లకంపెనీసేవకు లంతకుపూర్వము 'దివానులు' కాకపోయి నను అంతకంటె నేయిమడుంగు లధికమగు నధికారము చెలా యించుచుండిన విషయమును పాఠకులు గుర్తించియేయున్నారు. ఐదారు మాసముల క్రిందటనే, బంగాళాదేశపు నవాబుతో వారు కావించియుండిన సంధిని గమనింతుమేని రాజ్యాధికారము లన్నియు బూర్తిగ నాంగ్లేయుల హస్తగత మాయెనని స్పష్టమగుచున్నది.* అధికారముపాశములను చేజిక్కించుకొనియుండిన కంపెనీకి ఈ దివానీ యుద్యోగ మనవసరమై యుండుటయేగాక, దుర్భరమగు ద్వంద్వప్రభుత్వమున కయ్యది మాతృకమై, బంగాళాదేశస్థులు పదిహేను సంవత్సరములు వర్ణనాతీతమగు బాధల ననుభవించుటకుఁ గారణభూత మాయెను.

దివానీయధికార మనవసరమనుట తథ్యమే యైనను, ఆ కారణమున నాంగ్లకంపెనీకిఁ గలుగు లాభమును గమనింతము. పేరున కింకను ఢిల్లీశ్వరుఁడు సార్వభౌముఁడై యుండుటచే, నాతఁడు దయచేసిన 'దివానీ' యధికార ప్రభావ

---

* సంవత్సరమున కిరువదియాఱు లక్షల రూపాయల కప్పము చెల్లించుటకుగూడ క్లయివు సమ్మతించెను.

* Cf —"The theory that the cession of the Diwani or revenue administration to the company in 1765, left the Nawab in his full possession as Subahdar or Nizam has, therefore, to be counterbalanced by the very meterial consideration that the Treaty of February, 1705, deprived the Nawab of any independent military or financial support for his executive,"—

The fifth Report on the East Indian affairs—introduction, p. x

ముచే నాంగ్లకంపెనీకి నొకవిధమగు ప్రతిష్ఠ యలవడెను. తెలియనివారిని గనుబ్రాముట కీ దివానీ యధికారము మిక్కిలి యనుకూలముగ నుండెను. నిజామాధికారము నిజముగ నబాబునకే చెందియుండినను, ఆతఁడాంగ్ల పాశబద్ధుఁడై యుండుటచే, నాంగ్లేయులకుఁ గల యధికారమును నిర్ణయించుటకు వీలులేనిదియై యుండెను.

హైందవ రాష్ట్రములలోనెల్ల ధనవంతమగు బంగాళా దేశము దివానీ యధికారప్రభావముచే కంపెనీ యధీనమగుటయేగాక, ప్రభుత్వపరిపాలనాధికారములు గూడ పూర్తిగ వారి హస్తగత మాయెననియు, అట్టి విశేషాధికార సమన్వితులగు కంపెనీసేవకులు ప్రారంభదశయందు దురదృష్టవంతులగు దేశస్థుల యోగక్షేమము లరయకుండ గఠినముగ వ్యవహరించి యుండిరనియు, దివానీయధికార కైంకర్యముచే నాంగ్లేయుల కెట్టి మహాలాభములు చేకూరినను, దేశీయులకు మాత్ర మెట్టి లాభమైనను గలుగలేదనియును 'సర్ వాలంటైన్ చిరోలు' వ్రాసియున్నాఁడు *

---

* The grant of Diwani to the company by the Titular Emperor of Delhi gave the company not only the wealth of Bengal, the richest province in India, but full rights of government and administration, which were at first ruthlessly exercised with little or no regard for the interests of the unfortunate population, who alone gained nothing by the change.''—

p. 70. 'India, Past and Present', Sir Valentine Chirol.

# అనుబంధము

## క్లైవు జాగీరు

### క్లైవు జాగీరొక విచిత్ర కథ

క్లైవు సాహాయ్యమున విశాల రాజ్యాధిపత్యము వహింపఁజాలిన మీర్జాఫరు ధనహీనుఁడై, బలహీనుఁడై, గౌరవహీనుఁడై, సర్వజనకంటకుఁడై యెట్టి హైన్యమునకు బాల్పడెనో కాంచియుంటిమి. అడుగడుగునకు నాంగ్ల సాహాయ్య మవసర మగుటయు, తుద కాతఁడు క్లైవుమీఁదఁ బూర్తిగ నాధారపడియుండుటయు నరసియుంటిమి. అట్టి యసహాయత్వము సహింపఁజాలని తదాస్థానసభ్యులే మీర్జాఫరును "క్లైవుయొక్క గార్దభమా!" యని నిరసింపఁదొడఁగిరి. ఈ సందర్భమున నొక గాథ ప్రసిద్ధ మాయెను.

మీర్జాఫరు ఉద్యోగులలో నొకని యనుచరులు క్లైవు సైనికులతోఁ గలహించిరి: ఆ విషయ మెఱింగి, నబాబు నిండోలగంబున నా యుద్యోగిని నిష్ఠురముగ మందలించెను. వాఁడు కరములు జోడించి, యిట్లు సమాధాన మొసఁగెను — "మహీపాలా! నా కంతటి సాహసమా! క్లైవు యొక్క గార్దభమునకు సవినయముగ మూఁడు ప్రణామము

లాచరింపక యేప్రొద్దును లేవనివాఁడను క్లైవుతోడనే గల హింతునా ?''

తను రాజ్యాధిపతి నొనరించిన క్లైవునకు మీర్జాఫరు కృతజ్ఞతాపూర్వకముగా నిరువదిలక్షలు సమర్పించుటయే గాక, 'ఉమ్రావ్' అను బిరుదముగూడ నొసంగెను. (పు. ౧౮) నాఁటి బిరుదములు నేఁటి బిరుదములవలె కేవల గౌరవ భూయిష్ఠములుగావు. బిరుదముతోఁబాటు నొక జాగీరు కూడ నాఁటి భూపాలురు దయచేయుచుండిరి. కాని, మీర్జాఫరుమాత్రము నేఁటి చందముననే క్లైవును వృథాబిరుదముతోఁ దృప్తిబఱుపఁ జూచెను. బహు బహుమానములు వడసియుండిన యాంగ్లనాయకుఁ డట్లు సహించునని యతఁడు భావించెను. కాని, క్లైవు జాగీరు గోరుటచేత, మీర్జాఫ రట్లు లాచరింపవలసినవాఁ డాయెను. 'ఈస్టిండియా కంపెనీ' కలకత్తా నగరమునకు దక్షిణమున నున్న జిల్లాల ననుభవింపుచు, నందులకుఁగాను నబాబునకు సంవత్సరమునకు ముప్పదివేల పౌనులు చెల్లించుచుండిరి. ఆ జిల్లాలనే మీర్జాఫరు క్లైవునకు జాగీరుగాఁ బ్రధాన మొనరించెను. తద్భావ మేమన, ఆంగ్ల కంపెనీసేవకుఁడగు క్లైవు కంపెనీ యధినాథుఁ డాయెను. ఆతఁడు కొంతకాల మాజాగీ రనుభవించెను.

కాని, క్లైవు భాగ్యమును, ఆతని శౌర్యమును, సహింపక, కంపెనీ డైరక్టర్లు ఆ జాగీరుపైక మాతనికిఁ జెల్లించుటకు నిరాకరించిరి.

క్లైవాసమయమున నింగ్లాండునందే యుండెను. తనకుఁగల సత్వము వీడనొల్లక, యాతఁడు తన యధికారులపై నభియోగము దెచ్చెను.

కాని, వ్యాజ్యము తేలులోపున, గ్రంథమున వర్ణించినవిధమున బంగాళాదేశ పరిస్థితులు దారుణముగ విషమించెను. కంపెనీలాభములు కట్టువడెను. అట్టి సమయమున, సమర్థుఁడగు క్లైవే శరణ్యుఁ డాయెను. కంపెనీ యధికారు లాతఁడు పది సంవత్సరము లాజాగీ రనుభవింపవచ్చునని సమ్మతించిరి. క్లైవు ప్రభుబిరుదముగూడ గడించి బంగాళాదేశమునకు మగుడ నరుదెంచెను ( 1765 ). ఆతఁడు రెండుసంవత్సరములుమాత్ర మటనుండి తదనంతరము తన దేశమునకుఁ బోయెను. కంపెనీ యధికారు లాతని సేవకు సంతసించి, క్లైవుప్రభువు మఱి పది సంవత్సరము లాజాగీ రనుభవించుటకు సమ్మతించిరి.

కంపెనీ యధికారుల యౌదార్యము శ్లాఘనీయము. కాని, క్లైవుప్రభువు రెండుసంవత్సరములు మాత్రము జీవించెను. ప్రజాదూషణము, దుష్టరోగవేదనయు భరింపజాలక, యా మహానాయకుఁ డేఁబదేండ్ల ప్రాయముననే ( 1774 ) యాత్మహత్య గావించుకొనుట కరము విషాదకరము.

